# స్వేచ్ఛాయుత ప్రజాస్వామికం

మాసిమో సాల్వడోరి

అనువాదం:

ఎస్. ఎస్. రావు



దేశికవితా మండలి
విజయవాడ-2

దే శీ ప్ర చు ర ణ
ప్ర థ మ ము ద్ర ణ
ఆ గ స్టు — 1958
విక్టరీ ప్రెస్ విజయవాడ

సాదా ప్రతి 1.00
మేలు ప్రతి 1.50



## గ్రంధకర్త :

మాసిమో సాల్వాడోరి స్మిత్ కాలేజీలోను (మాసచుసెట్స్) బెన్నింగ్టన్ కాలేజీలోను (వెర్మాంట్) హిస్టరీ ప్రొఫెసరుగా పనిచేస్తున్నాడు ఈయన జననీ జనకులు బ్రిటిష్, ఇటాలియన్ వంశీయులు. ఇతడు ఇటలీలోనే పెరిగాడు. ఇటలీ ఫాసిస్టు పరిపాలన క్రింద వున్నప్పుడు, ఈయన, ఈయన తల్లిదండ్రులు యమయాతనలు అనుభవించారు. యుద్ధకాలంలో ఇటలీలోని బ్రిటిష్ ప్రత్యేక సైనికదళంలో చేరి పనిచేశాడు. డి. యస్. ఒ., ఎం. సి. పతకాల్ని బహుమతులుగా పొందాడు. ఇటలీలో మిత్రరాజ్య సైన్యాలకూ, ఇటలీ జాతీయ విమోచనసంఘానికి లైజాన్ ఆఫీసరుగా పనిచేశాడు. యుద్ధం చివరి కొలది నెలల్లో, శత్రువులు ఆక్రమించిన ప్రాంతంలోనే వుండి పనిచేశాడు. యుద్ధం ముగిసిన దగ్గర నుంచీ అధ్యాపకుడుగా పనిచేస్తూనే, తన కాలాన్ని U. N. E. S. C. O. కు N. A. T. O. కు వినియోగించాడు. 'The Rise of Modern Communism, American capitalisim, మొదలైన గ్రంథాలు రచించాడు. London, Liberal International కు చెందిన World Liberalism అనే త్రైమాసిక పత్రికకు నియమంగా 'American Notes' వ్రాస్తూవుంటాడు.

# ఈ పుస్తకాన్ని గురించి:

స్వేచ్ఛను, ప్రజాస్వామికాన్ని నిష్కపటంగా చర్చించటం లిబిరల్ ప్రజాస్వామికం అంటారు. ప్రజాస్వామిక పద్ధతి క్రింద స్వేచ్ఛయొక్క పుట్టు పూర్వోత్తరాలు, లాభాలు, కమ్యూనిజంతో సంబంధం లేనట్టిది, యితర 'ఇజమ్'లలో ఒడంబడిక లేనట్టిది, ప్రజాస్వామికం యొక్క లిబిరలిజం స్వేచ్ఛయొక్క నిర్మాణాన్ని వర్ణిస్తుంది. లిబరల్ ప్రజాస్వామికంలో, స్వేచ్ఛా లాభాలు, వ్యక్తి స్వేచ్ఛనే కాకుండా, విజ్ఞానాన్ని, నైతిక సమానత్వాన్ని, స్త్రీ పురుషుల సమాన హోదాను, స్వేచ్ఛా పరిశోధనకు అవకాశముంటుంది. స్వేచ్ఛద్వారా అభివృద్ధి, శ్రేయస్సు ఎక్కువ శాంతి సౌఖ్యాలు పొందవచ్చును.

---

పడతారు. అందరూ ఒకటేనని అంగీకరించిన ప్రజానీకం ఒకరి నొకరు ఎందుకు ద్వేషించుకుంటారు? మానవ చరిత్రలో ఇన్ని కుమ్ములాటలు, ఖూనీలు, హత్యలు, హింసాకాండ, ఎందుకు జరుగుతున్నది?

"మానవులంతా స్వేచ్ఛను కలిగివున్నారు." అంటూ అమెరికా స్వాతంత్ర్య ప్రకటన (1776) చెబుతున్నది. "మానవులకు నిర్బంధంలేదు" అని 1789 లో ఫ్రెంచివారు పౌరుల హక్కులలో వ్రాసివున్నారు. "విప్లవాన్ని స్వేచ్ఛ అని పిలుస్తారు" అంటూ 1919 లో ఫాసిజం స్థాపించిన సృష్టికర్త అన్నాడు. "ఫాసిజమ్ మన స్వేచ్ఛను కాపాడుతుంది" అని ఇటాలియన్ యువకులు పాటలు పాడారు. "స్వేచ్ఛను యిచ్చే రోజు ఇక్కడనే వున్నది." అని జర్మన్ ఫాసిస్టులు అరిచారు. 1956 సం॥ లో అమెరికన్ కమ్యూనిస్టుపార్టీ "మానవుని స్వేచ్ఛా హక్కులు" అనే నినాదాన్ని ప్రచారంచేసింది.

"యదార్థమైన ప్రజాస్వామికం" అంటూ నూరెంబర్గ రాక్షసుడు, చికాగోనుంచి టోకియోవరకు, జర్మనీలో వున్న వందలమిలియనుల ప్రజానీకంచేత వీరపూజ చేయించుకున్నాడు. "నిజమైన ప్రజాస్వామ్యం" అంటూ చలిచప్పుడు లేకుండా విశ్శబ్దంలో క్రెమ్లిన్ గదులనుంచి వినపడుతుంది. ఆ మత్తెక్కిన పిచ్చినాయకుడ్ని అనేకమంది రష్యయనులు, అనేకచోట్ల వున్న కమ్యూనిష్టులు ఆరాధిస్తారు. గడిచిన పదిహేను సంవత్సరాలలోను అన్ని నవీన పద్ధతులుకూడా శక్తివంతమైన నిరంకుశ ప్రభుత్వంవైపే మొగ్గుజూపినవి. అర్జెంటీనీయన్ న్యాయవాదం

అమెరికా అలలు, యుగోస్లోవియా జాతీయ కమ్యూనిజం, ఈజిప్ట్సియన్ జాతీయవాదం కలిపి నిజమైన ప్రజాస్వామికం అని ముద్దర వేశారు.

అనుకూలమైనమాటలు ఉపయోగించటం మనవాళ్ళ- మనలో చాలామంది గొర్రెలవలె తయారైనారు. గొర్రెలను కొండచివరకు తరుముకొని వెళ్ళినట్లు, విమర్శనాదృష్టి లేకుండా మన ఆలోచనలను, ఆత్మలను సంతృప్తిపర్చే మాటలతో పొంగిపోయినాము. స్వేచ్ఛ అనేపేరుతో క్రూర నిరంకుశత్వాన్ని ప్రతిపాదిస్తారు. ప్రజాస్వామికం పేరుతో ఒకనికే సర్వాధికారం అప్పగిస్తారు. శాంతి అనేపేరుతో మాస్కో కొన్ని సంవత్సరాలుగా యుద్ధానికి తయారైనది. శ్రేయస్సు అనేదృష్టితో పీపింగ్, చైనీయుల జీవిత పరిణామాన్ని తగ్గించినది. (ఇటాలియన్‌లను ఫాసిజం చేసినట్లుగా); అభివృద్ధి అనే సాకుతో కమ్యూనిస్టులు అనాగరిక జాతుల సమిష్టి సాంప్రదాయాన్ని తిరిగి నెలకొల్పారు. పూర్వ సాంప్రదాయాలను పాటించేవారు మధ్యయుగాలనాటి సమాజాలను అభివృద్ధి జేశారు. జాతీయవాదులు పూర్వీకుల కట్లుబాట్లను తిరిగి స్థాపించారు. విదేశీయులు మూఢులని, అనాగరికులని వీరు భావిస్తారు. స్వేచ్ఛకు ప్రజాస్వామికానికి రెండువందల నిర్వచనాలు వుండవచ్చును. వ్యక్తిని సమాజానికి దాసునిజేసే రూసో విధానంగాని (జాకోబిన్ మరియు కమ్యూనిస్టు), బక్లీ చెప్పే (క్రిస్టియన్ సంప్రదాయం) స్వేచ్ఛను ముక్తితో ముడిపెట్టే ఆచారంగాని, హెగెల్ (జాతీయవాది మరియు ఫాసిస్టు) చెప్పినట్లు సర్వశక్తిసంపన్నం, సర్వం నాదే అనేరాజ్యాంగానికి బలి

వీయు విధానాలను స్వేచ్ఛఅని అనరు. అది స్వేచ్ఛకాదు. ఈ విషయాన్ని మనం స్పష్టంగా గ్రహించాలి. మరియు ప్రజాస్వామికం అంటే, సమానత్వం మాత్రమే కాదని (అధికారం చలాయించే ఒట్టమాన్ రాజ్యంలో సమానత్వానికి దగ్గరలో వుండే సమాజం అయిదువందల సంవత్సరాలనుంచీ వున్నది) మెజారిటీ హక్కుమాత్రమే కాదని (పెద్ద మెజారిటీవున్న హిట్లరు జర్మనీని, పెరాన్, అర్జెంటీనానుగాని ప్రజాస్వామికం చేయలేదు) వివేకంగల ప్రభుత్వంకోసం భక్తిశ్రద్ధలతోను, ప్రేమతోను పాటుబడే ప్రజానీకం కాదని తెలుసుకోవాలి. (అగస్టస్, లిషిచ్ఔస్, కమీస్, అక్బరు వంటివారిని ప్రజానీకం ప్రేమించినది వారి పరిపాలన ముఖ్యంగా ప్రజల సుఖం కోసమే సాగించారు. అయితే రోమన్, అరబ్, చైనీస్, మొగల్ సామ్రాజ్యాలలో ప్రజాస్వామికం లేదు.)

అయితే స్వేచ్ఛ, ప్రజాస్వామికం అంటే ఏమిటి? స్వేచ్ఛ అంటే వ్యక్తిసౌఖ్యకోరిక, వ్యక్తిచేసేపని, వాని నిర్ణయంమీద ఆధారపడివుంటుంది. ప్రజాస్వామ్యం అంటే స్వేచ్ఛను ఒక క్రమపద్ధతిలో ఏర్పర్చటం. అట్టి పద్ధతిలో ఏర్పడిన ప్రజాస్వామ్యాన్నే, స్వేచ్ఛాప్రజాస్వామికం అంటారు. దాని ప్రధానమైన ఆ కృతి స్వేచ్ఛ, సమానత్వం ఒకదాని కొకటి పెనవేసికొని వుంటవి. (సిద్ధాంతవాదాలను చెప్పేవారు, మానవజాతి అనుభవం – చరిత్ర ఆధారం – యివన్నీ గమనిస్తే సమానత్వంలేని స్వేచ్ఛ ఒక హక్కుమాత్రమే ననియు, అది స్వేచ్ఛగావుండే సమాజాలను నిర్మూలించు ననియు స్పష్టంగా తెలుస్తున్నది. స్వేచ్ఛలేని సమానత్వం,

కల్తీలేని స్వచ్ఛమైన ప్రజాపీడనూ) సంప్రదాయవాదులు, జాతీయవాదులు మరియు కమ్యూనిస్టులు పరస్పరం ద్వేషించు కుంటారు. ఎక్కువగా లిబరల్ ప్రజాస్వామికాన్ని ద్వేషిస్తారు. వారంతా స్వేచ్ఛను నిందించటంలో సమానస్థాయిలో వుంటారు. మన నవీన కాలంలో లిబరల్ ప్రజాస్వామికం ఉత్తర అట్లాంటిక్ జాతులలో ఉద్భవించినది. అయితే యిది అకస్మాత్తుగా సంభవించిన చారిత్రక సంఘటన జ్యూజాతిలో నుంచి క్రైస్తవులకు జీసస్సు, ఆర్యులలో నుంచి బౌద్ధమతస్థులకు గౌతముడు, పుట్టుకలలో గల ప్రాముఖ్యతకంటే ఇందులో ఎక్కువ ఏమీలేదు. స్వేచ్ఛ పశ్చిమానికి చెందినది మాత్రమే కాదు. ప్రపంచానికంతకూ చెందినది లిబరల్ ప్రజాస్వామ్యం కూడా ఒక పశ్చిమానికి చెందినదే కాకుండా, ప్రపంచాని కంతకూ చెందుతోంది. స్వేచ్ఛను అన్నిటికంటే ముఖ్య మైనదిగా పరిగణించే అన్ని దేశాల ప్రజానీకానికి అది చెందినది.

*

# 1

## అవలోకనము

గడచిన యాభై సంవత్సరాలలో జరిగిన యుద్ధాలు, విప్లవాలు క్లిష్టపరిస్థితుల ఫలితంగా బ్రహ్మాండమైన మార్పులు వచ్చినవి. వీటిలో అతిప్రధానమైనవి ఆవేశం, తర్కం అని బెర్‌ట్రాండ్ రస్సెల్ గుర్తించాడు. "అనేకమంది ఆవేశాలు, కొద్దిమంది నిర్ణయాలు" అనే ప్రాతిపదిక వచ్చినది. గతంలో జరిగినట్లుగానే, వచ్చే దశాబ్దాలలో కూడా దాదాపు ఇదేపాత్ర వహించుటకు వీలున్నది. ఈ ఆవేశాలను అణచివేయాలన్నా, వైజ్ఞానిక నిర్ణయాలకు చేరాలన్నా, ప్రత్యేకంగా నిరుపమమైన ఆలోచనాశక్తి, జ్ఞానం, హేతువాదదృష్టి అవుసరం. నమ్మకమును ఆధారంగా చేసికొని, అంతులేని ఆవేశానికి, మూఢత్వానికి లోనై, దౌర్జన్యపూరితంగా పైబడే ఉద్యమాలను సూటిగా ప్రతిఘటించాలి. ఇట్టి అమానుషకృత్యాలను అరికట్టకపోతే దౌర్భల్యానికి దారితీస్తుంది, అనేకమంది లిబరల్ ప్రజాస్వామికవాదుల, స్వేచ్ఛకు శత్రువులైన మతాలలో చేరిపోయారు.

ఈరోజు న్యాయరీత్యా ప్రపంచంలో రాజాధికారంగల స్వతంత్రరాజ్యాలు తొంభై వున్నవి. వాటి రాజ్యాంగాలలో ఏమి చెప్పబడినప్పటికి, యదార్థంగాచూస్తే స్వేచ్ఛను అనుభవించే ప్రజానీకంగల రాజ్యాలు అందులో మూడవవంతుకు

తక్కువగావుంటాయి. తక్కినచోట్లంతా ఎక్కడ జూచినా నియంతృత్వం స్వైరవిహారం చేస్తున్నది. అధికారబలం పరిపాలన సాగిస్తున్నది. నాయకుల అధికారాన్ని అనుభవించేటందుకు వారి లోపాలు భిన్నాభిప్రాయాలుతప్ప మరొకటి లేదు. అనుసరించే విధానాన్ని బలవంతంగా అమలుకు తెస్తారు. అందుచే ప్రజానీకం దాస్యంలో, విధేయతలో వుండిపోతారు. (ఇట్టి పరిస్థితులకు సాధారణంగా వారు ఇష్టపడతారు.) 1956 సంవత్సరంలో ఇండియా క్వార్టర్లీలో, అంతర్జాతీయసమితిలో జేరినరాజ్యాల రాజ్యాంగ నిర్మాణంనుగూర్చి గ్రంథకర్త ఒక వ్యాసాన్ని ప్రచురించారు. "ప్రజాస్వామిక రాజ్యాలు ప్రస్తుతం పదిహేనుది మాత్రమే వున్నాయి. అయిదు ఆసియారాజ్యాలలో ఏకపేటు వహింపరాని హద్దులు వున్నాయి. పేదరికం, రాజకీయ అనిశ్చిత పరిస్థితులు విద్యావిహీనత ప్రధానకారణాలు. అధికారం మాత్రం కొన్ని వర్గాలుమాత్రమే చలాయిస్తున్నాయి. అయితే అవి ప్రజాస్వామ్య సమాజములను ప్రోత్సహించుటకు, వారిలోవారికి స్వేచ్ఛను పెంపొందించుటకు ఉపయోగపడుతున్నది. కనుక అంతర్జాతీయ సమితిరాజ్యాలలో 23 రాజ్యాలుమాత్రమే ప్రజాస్వామ్యాన్ని అభివృద్ధిపరచుటకు ప్రయత్నం చేస్తున్నాయి. పదుకొండు రాజ్యాల రాజకీయ నిర్మాణం సంపూర్ణాధికారిత్వంమీద ఆధారపడి వున్నది. మిగతా 26 రాజ్యాలలో అధికారం ప్రజాస్వామికానికి వ్యతిరేకంగా వున్న నియంత చేతులలోనో, రాజకీయంగా, సాంఘికంగా వెనుకబడివున్న మైనారిటీవర్గాల చేతులలో వున్నది. ఈ 26 రాజ్యాల సాధారణప్రతిపత్తి నియంతృత్వంమీద కాక,

సంపూర్ణాధికారంమీద ఆధారపడినది. రాజకీయాలకు ప్రత్యక్షంగాగాని, పరోక్షంగాగాని, సంబంధంలేని అన్ని రంగాలలోను వీలైనంతవరకు స్వేచ్ఛను ఇచ్చారు. ప్రజాస్వామిక, నియంతృత్వ, సర్వాధికారంగల రాజ్యాల నిష్పత్తిలో గత మూడు సంవత్సరాలలోను మార్పేమీ రాలేదు. ఇది సమితిలో సభ్యులుగావున్న రాజ్యాలకు, సభ్యత్వంలేని మిగతా రాజ్యాలకు వర్తిస్తుంది.

స్వేచ్ఛను అనుభవించుచున్న జాతులు మానవాళి యొక్క శక్తిని తెలుపుతున్నమాట వాస్తవమే; అభివృద్ధికి, నడిపించు రీతికి వారు మార్గదర్శకులుగా వున్నారు. కాని సత్వంలో కృశించిపోతున్న జాతులు, స్వతంత్రంగావున్న ప్రజానీకాన్ని జూచి, వాళ్ళ ఉత్సాహాన్ని జూచి పొంగిపోతున్నారు. కాని మనం మోసపోకూడదు. ఉత్తరఅమెరికా దేశాలు తప్పిస్తే పూర్వంవలె స్వతంత్రంగావున్న రాజ్యాలు అంతశక్తివంతంగాలేవు. ప్రపంచం నలుమూలలా స్వేచ్ఛ స్వేచ్ఛ అని కలవరిస్తూ విశ్వప్రయత్నాలు చేస్తూవుంటే, స్వతంత్రంగా వున్నవారు ఆదర్శంగావుండక దిగజారిపోతున్నారు.

నేడు స్వేచ్ఛగావున్న రాజ్యాలలో కూడా మానవుని యొక్క స్వేచ్ఛ పరిమితంగానే వున్నది. ప్రజలు భావాలు, వస్తువులు వర్తకవాణిజ్యాలు ఒకదేశాన్నుంచి మరొక దేశానికి పోవటం రానురాను కష్టతరంగా వుంటున్నది. వున్న దేశంలో మెలగుటకే తరుచు నిర్బంధాలను ఎదుర్కోవలసి వస్తున్నది. నవీన భావాలు వెదజల్లుతూ, ఉత్సాహంగా ముందుకు సాగిపోతున్న ప్రజానీకపు నవశక్తిని యిముడ్చుకొనుటకు బదులు,

మూర్ఖమైన పిడివాదం సాగిపోతున్నది. సత్యాన్ని గమనించుటకు మనస్సులు నిరాకరిస్తూ మూసుకుపోతున్నాయి. దూషణను, తప్పిదాలను, కీడును నిర్మూలించుటకు స్వశక్తిమీద ఆధారపడక, అతి చిన్న విషయానికి ప్రభుత్వజోక్యాన్ని ప్రార్థిస్తూ వ్యక్తిత్వాన్ని పరిమితం చేసికుంటున్నారు. అధికారంలో వున్నవారిని అజమాయిషీలో పెట్టుటకు రానురాను కష్టమైపోయినది. ఒకసారి యీపిశాచం పెరిగినట్లయితే దానినితొలగించటం దుస్సాధ్యం. చేసిన పొరబాట్లను సరిదిద్దటం కష్టం. ప్రాచీన మెడిటరేనియన్ ప్రపంచంలో వున్న స్వతంత్ర దేశాలలో కొన్ని శతాబ్దాలపాటు స్వేచ్ఛ బ్రతికింది. మధ్యయుగపు యిరోపాలోని స్వతంత్ర కమ్యూన్సులో కూడా కొద్దికాలంపాటు స్వేచ్ఛ జీవించినది. నవీన జాతులలో స్వాతంత్ర్యనిర్మాణమునకు ఏర్పడిన ఉద్యమం దాదాపు పదితరాలనుంచి, ఇంగ్లీషు-మాట్లాడే దేశాలలోనూ, కాంటినెంటల్ యిరోపాలో 6 లేక 7 తరాలనుంచి జరుగుతున్నది. వాటి ప్రభావం యితర దేశాలకు కూడా ప్రాకింది. యిరోపాజాతులు కానివారుకూడా దాని చైతన్యానికి లోనైనారు. ఇరవయ్యో శతాబ్దంలో రోమనులు, గ్రీకులుచేసిన ఘోరమైన తప్పిదాలనే తిరిగిచేశారు. గ్రీకులు ఫిల్ప్ఫ్‌ను ఆహ్వానించారు; రోమన్లు సీజరును కొగలించుకున్నారు; దేశోద్ధారకులుగా గౌరవించారు; గ్రీకులు, రోమన్లు, ఫ్లెమింగ్సులటన్‌కన్సు వాస్తవమైన స్వాతంత్ర్యాన్ని కావాలనుకున్నారు. అందుకు బదులుగా నిరంకుశత్వం వారికి ప్రాప్తించినది; శాంతికిబదులు యుద్ధాలువచ్చినవి. సంపద,

శ్రేయస్సుకు బదులు దరిద్రం తాండవించినది. అప్పటి అభివృద్ధి కాముకులు ఫిలిఫ్, సీజరు, బర్గండియన్సు వెండిసీస్‌లను కావాలని కోరుకున్నారు. స్వతంత్రసమాజాలను కాపాడేవారిని, ఘాతకులుగా భావించారు. ఈ రోజు అభివృద్ధికాముకులు కృశ్చేవ్, మావో, టిటో, ఫ్రాంకోనాజరలో కావాలంటున్నారు.

17, 18, 19 శతాబ్దాలలో జరిగిన విప్లవాలకు వారసులైన లిబరల్సు అయోమయంలోపడి బలహీనతగా వున్నారు. స్వేచ్ఛ కలగా మారిపోయింది. స్వతంత్రంగావున్న సమాజంల లోని లోపాలను విమర్శించటం అనే మత్తులో లిబరల్స్ పడిపోతున్నారు. ప్రయోజనమైన ఫలితాలను గమనించుటలేదు. పరిపూర్ణత, ఆదర్శప్రాయమైన స్వాతంత్ర్యాన్ని లక్ష్యంగా స్వీకరిస్తుంది. అది పరిపూర్ణత చెందినవారికే పీలుగావుంటుంది. అందువల్ల పరిమితంగా స్వేచ్ఛవుంటుంది. అసంపూర్ణమైన స్వతంత్రత మానవస్వభావాన్ని సంకుచితం చేస్తుంది. స్వేచ్ఛను, సమానత్వంతో ఏకత్వంగా లిబరల్సు చూస్తారు. మధురమైన సాంఘిక పరిణామాల కలయిక, కలలు గంటున్నవారి మనోఫలకంలోనే వుండిపోతుంది. స్వతంత్రంగా వుండే వర్గాలని, తరగతిని, అభివృద్ధిని, శాంతిని, శ్రేయస్సును, సుఖాన్ని లిబరల్సు కాంక్షిస్తారు. అయితే వారి పరిశోధనలో, స్వేచ్ఛ విభేదాలకు దారితీస్తుందని, అసమానతకు మార్గంగా వుంటుందని కనుగొన్నారు. బానిసత్వంలోవున్న సమాజంకన్నా, స్వేచ్ఛగా వున్నదానిలోనే అసందిగ్ధ పరిస్థితులు వుండునని స్పష్టంగా తెలిసింది. స్వేచ్ఛగావున్న ఆర్థికవిధానం స్వాతంత్ర్యాన్ని, ఆ వర్గంలోని సభ్యులే స్వేచ్ఛ పేరుతో భయపెడతారు. లిబరల్

ప్రపంచంలో సందేహానికి, ఆలస్యానికి తావులేదు. సౌఖ్యానికి, స్వేచ్ఛతో ఎంతమాత్రం పొత్తులేదు. అందువల్ల అనేకమంది లిబరల్స్ నిరుత్సాహపడి, నిజమైన స్వేచ్ఛకోసం, సోషలిస్టు సమాజంలో ప్రథమంగాను, తదుపరి కమ్యూనిస్టు సమాజంలో వుబలాటపడ్డారు.

లిబరల్ భావాన్ని వ్యాపింపజేయుటకు ఇది అనుకూలమైన వాతావరణం, "మంచి భవిష్యత్తు ఏమిటో గ్రహించకుండా, ఎలావుంటుందో తెలుసుకోకుండా, మెజారిటీ మానవజాతి భవిష్యత్తుకోసం ముందుకు సాగిపోతున్నది" అని జేమ్సువార్ బర్గు కొద్దికాలం క్రితమే వ్రాశారు. అభివృద్ధినే అంతిమ లక్ష్యంగా పెట్టుకొని ముందుకు పోతున్నారు. ప్రపంచంలోని మానవుని మనుగడకు నైతికంగా, సాంఘికంగా పెంచుటకు అభివృద్ధి కావాలంటున్నారు. అభివృద్ధిని లిబరలిజమ్ ఎప్పుడూ కావాలంటుంది. జీవితాన్ని వికాసవంతంగా చేయుటకు, ఎక్కువ జ్ఞానాన్ని సంపాదించుటకు, ముఖ్యంగా ప్రకృతి శక్తులమీద అధికారం సంపాదించి, మానవుని శ్రేయస్సును పురోగమించేటట్లు చెయ్యాలంటుంది. లిబరల్ ప్రజాస్వామిక సమాజాలలో అభివృద్ధి స్వభావికంగా వుంటుంది. లిబరల్ మార్గం, నిరంకుశమైన అధికారంగల పాలకులమీద, స్వేచ్ఛ, సమానత్వం పౌరులకు పూచీనిస్తూ, పరిమితంగా సృష్టించబడిన శాసనాలలో, మానవుని సృజనాత్మకశక్తిని గ్రహించుతుంది. మొదట్లో మెజారిటీ మానవజాతి హృదయాలు యీ కొత్తదనానికి లొంగిపోయినప్పటికీ క్రమేణా అభివృద్ధినిరోధక శక్తులుగా మారిపోతారు. ఎందుకంటే, సహేతుకమైన దృష్టిలేని రాజకీయ

నిరంకుశత్వాధికారాలు గల్గిన సమాజాలు, ఆర్థిక బానిసత్వం, వ్యతిరేక సిద్ధాంతాలద్వారా పనిచేస్తారు. మానవుని ఆలోచనా శక్తిని, సృజనాత్మకశక్తిని, భౌతికవాదాన్ని అణచివేస్తుంది. ఈవిధంగా జరిగితే పురోగమనం సాధ్యపడదు.

అభివృద్ధి దాతృత్వానికి ఒకమార్గం. రాజకీయ నిరంకుశత్వం, క్రూరత్వం, ఆలోచనను అరికట్టే విధానాలనుండి వ్యక్తి స్వేచ్ఛను కాపాడుకోవాలి. వ్యక్తి వికాసంచెందేట్లుగా చూడాలి. ఇవి మానవుని అనుభవంమీాద తెలుస్తున్నాయి. మానవుడే కొలతబద్ద. మానవుడే తన భవిష్యత్తును నిర్ణయించుకోగలడు అనే సిద్ధాంతానికి దారితీసే ప్రతిచర్యా పురోభివృద్ధికి మార్గమనే చెప్పాలి. స్వేచ్ఛ మానవుణ్ణి ముందుకు నడిపిస్తుంది. అది పొందినప్పుడు హెచ్చుతగ్గులు లేకుండా వుంటుంది. అధికారం, సంపదమీాద అజమాయిషీ వున్నవారికి, లేనివారికి తారతమ్యం వుండదు. అందరు సమిష్టిగా సత్యంకోసం, న్యాయంకోసం, భౌతిక పరిస్థితులను వృద్ధిజేసుకొనుటకు, రాజకీయాధికారంలో భాగస్వాములగుటకు వీలుంటుంది. అభిప్రాయభేదాలు పొడసూపినా అభివృద్ధికి వీలుంటుంది. సమానత్వంలోకూడా వ్యక్తిత్వాన్ని కాపాడుకోనేందుకు అవకాశ ముంటుంది. స్వేచ్ఛలేకుండా ఒకజాతిలో వ్యత్యాసాలు వున్న అది అభివృద్ధిని సాధించలేని కులవర్గంగా మారిపోతుంది. అట్లాగే స్వేచ్ఛలేని సమానత్వం, సమానత్వంలేని స్వేచ్ఛ వున్నప్పుడుకూడా అభివృద్ధిని సాధించటం కష్టం. సమానత్వంగావున్న ఇస్లాంసమాజాలు ఎన్నో తేడాలున్న హిందూ

సమాజంకన్నా మెరుగుగా లేవు. ఒక్క విషయంలోమాత్రం సమానంగా వుంటాయి. రెంటిసమాజాలలోను స్వేచ్ఛ లేదు. అందువల్ల అభివృద్ధి లేదు.

అట్లాంటిక్ ఇరుపక్కలావున్న మన తాతముత్తాతలను నాగరికతగల సమాజంలో స్వేచ్ఛను ఏవిధంగా ప్రతిపాదించాలో నిర్దుష్టమైన దూరదృష్టివున్నది. ఈరోజున ఆ దృష్టి అంత విపులముగ కాన్పించుటలేదు. అందువల్ల అనేకమంది లిబరల్స్, లిబరలిజానికి తిలోదకాలు వదిలిపెట్టి, క్రూరమైన సిద్ధాంతాలను సమర్థిస్తున్నారు. లిబరలిజాన్ని నిర్మించినవారికీ, స్వేచ్ఛకు ఒక ప్రభుత్వం వుండాలనీ, ఆ ప్రభుత్వం స్వేచ్ఛగా ఎన్నికలలో విజయంపొందిన ప్రజాప్రతినిధులచేత ఏర్పర్చాలని, అధికారం వికేంద్రీకరణం చెయ్యాలని, భాహాటంగా చర్చలకు అవకాశముండాలని, ప్రతిపక్షాలను, భిన్నాభిప్రాయాలను స్వేచ్ఛగా వర్ధిల్లేటట్లు చెయ్యాలని వారికి తెలుసు. కాని ఈ సమాజాలు పరిపూర్ణతకు దూరంగా వున్నాయి. అవి ఎప్పుడూ అలాగేవుంటాయి. లేకుంటే ఒక నిర్మాణాత్మకమైన సమాజంగా వుండక, స్వేచ్ఛ అకస్మాత్తుగా వచ్చినట్లు వుంటుంది.

లిబరలిజానికి బాహాటంగావున్న శత్రువులు, స్వేచ్ఛా సమాజాల లాభాలను దూషించేవారు. వారు నిర్మాణాత్మకంగా తయారై అధికారాన్ని చేలాయిస్తున్నారు. ఫాసిస్టులు, నాజీలు, జాతీయవాదులు, మూఢవిశ్వాసాలను జీర్ణించుకొన్న క్రైస్తవులు, ముస్లింలు యీ తెగకుచెందిన వారు. ప్రతిపక్షాల వారిసంగతి చూస్తే, యధార్థమైనస్వేచ్ఛ అనే పేరుతో లిబరలిజాన్ని, లిబరల్ ప్రజాస్వామికాన్ని ఎదిరించారు. వారు

కమ్యూనిస్టులు, అధికార గర్వంగల సోషలిస్టులు, మూర్ఖంగా మూఢభక్తిగావున్న సమిష్టి సముదాయం గలవారు. స్వేచ్ఛ మైన స్వేచ్ఛ పేరుతో, అమాయిక లక్షలాది ప్రజానీకాన్ని మోసపుచ్చినవారు. ప్రజలసాధారణ వాంఛను సమర్థిస్తున్నా మని చెబుతూ, అతిక్రూరమైన నియంతృత్వంగల రష్యాలో 15 వేల మిలియన్లు, చైనాలో 20 వేల మిలియన్లు ప్రజానీకం ఆహుతి అయిపోయినారు. యిదంతా కమ్యూనిజం విజయం సాధించేందుకే జరిగింది. కమ్యూనిస్టుల మొటు గొప్పగా వుంటుంది. లెనిన్, స్టాలిన్ కాలాలకన్నా యిప్పుడు విపరీతంగా వున్నది. కమ్యూనిస్టులు శక్తివంతంగా బలంగా వుంటారు. యితర రాజకీయపార్టీలకు చెందిన సభ్యులుకన్నా ఎంతో ఉత్సాహంగా వుంటారు. కమ్యూనిస్టులలో పార్టీతత్వం కరుడు కట్టుకొని వుంటుంది. వారిసిద్ధాంతాలలో వారికి మూఢవిశ్వా సంవున్నది. వాటిని ఆరాధిస్తారు. వారి వాంఛలకు తిరుగులేదు. వాళ్ళు ఒకశక్తి. వాళ్ళ శక్తిని నిరోధించాలంటే, అంత శక్తి గల వాళ్లే ఎదుర్కోవాలి. అప్పుడే వాళ్ళ అభివృద్ధిని ఆప గలరు. ఈ తగాదాలకు చివరఅంటూ లేదు. చిన్నాపెద్దా అనే తారతమ్యం లేదు. కనుక ప్రస్తుతం మంచుతో కప్పుకుపోయిన లిబరల్ ప్రజాస్వామికాన్ని పైకితీయవలసిన అవుసరం ఎంతైనా వున్నవి. స్వేచ్ఛయొక్క అర్థాన్ని గ్రహించినవారి వాంఛను మనం బలపర్చాలి.



# 2

## నిర్వచనము

సాపేక్షంగా "లిబరలిజం" ఇటీవలవచ్చిన మాటే, అయిదు తరాలనుండి మాత్రమే అది వాడుకలో వుంటున్నది. అయితే అది చెప్పేమాటలు చాలాకాలంనుంచి అసలులో వున్నాయి. ప్రాచీన మెడిటెరేనియన్ ప్రపంచంలో తూర్పున, మధ్యగాను వున్న పట్టణాలలో దానియొక్క అనుభవాన్ని ప్రప్రథమంగా పొందాము. లిబరలిజం అనేదానికి రెండు వ్యతిరేకమైన అర్థాలు ఏర్పడినవి. ఒకటి అభిప్రాయానికి సంబంధించినది. రెండోది అంతానాదే అనే తత్వజ్ఞానవాదం ఆధారంగా ఏర్పడిన రాజకీయసిద్ధాంతం. ఖచ్చితమైన సమాజాలద్వారా అనుభవమునకు వచ్చినట్టిది. అభిప్రాయానికి సంబంధించిన లిబరలిజంతో నాకు ఇప్పుడు పనిలేదు. అది మామూలుగా నిష్కపటంగాను, ఔదార్యంగాను, సానుభూతితో వుంటుంది. ఈఅర్థంలో ఏ వ్యక్తి అయినా, ఎంతటి నిరంకుశ అధికారాన్ని చలాయిస్తున్నా లిబరల్‌గా చలామణి కావచ్చు. ఉదాహరణకు, సైరస్, రష్యా మొదటి అలెగ్జాండరు – ఇద్దరూ నిరంకుశ ప్రభువులే. రాజకీయ సిద్ధాంతంగల లిబరలిజంతోనే నాకు సంబంధం. అది ఏర్పర్చే సమాజాలు, ఆవేశాలు, భావాలు, న్యాయమని కనబర్చేవిధానం తెలుసుకోవాలి. ఈ అర్థంలో

లిబరలిజం అంటే స్వేచ్ఛను ఒక నిర్మాణాత్మకమైన పద్ధతిలో ఏర్పరచుట. ఎవ్వరైతే స్వేచ్ఛను అన్నిటికన్నా పైస్థాయిలో వుంచుతారో, గొప్పవిలువను యిస్తారో, అవుసరమైన శ్రేయస్సుకు, శాంతిని, సంపదకుమించిన గౌరవాన్ని యిస్తారో, వారు లిబరల్స్, ఈ అర్థంలో పురాతన మెడిటిరేనియన్ సిటీస్టేట్సు కొన్ని తరాలదాటు, అవి సామ్రాజ్యాలుగా మారేముందు లిబరల్స్‌గానే వున్నాయి. అట్లాగే కొన్ని "కమ్యూన్సు" కూడా నిరంకుశ ప్రభువులు రాకపూర్వం లిబరల్‌గానే వున్నాయి. నవీనకాలంలోకూడా కొన్ని పశ్చిమ యిరోపా రాజ్యాలు, ఈమాట అమలులోనికి రాకపూర్వమే లిబరల్‌గా వున్నాయి.

స్వేచ్ఛ, స్వాతంత్ర్యం, అనే పదాలు ఉపయోగించినప్పుడు, హేతువాదదృష్టితో కాకుండా, అంతర్‌జ్ఞానదృష్టితో అవి ఎందుకు ఏర్పడినవో గమనించగుండా అంటారు. స్వేచ్ఛ యొక్క అర్థాన్ని తెలుసుకొనుట ఎంత కష్టసాధ్యమో, జీవిత పరమార్థాన్ని గ్రహించటంకూడా అంతకష్టం. అయితే దాన్ని జీవితాన్నుంచి వేరుజేయలేం. మన హేతువాదదృష్టి పరిమితం. మన చుట్టూ వున్నదేదో అది చెప్పగలదు. ఇంకా పెద్ద ప్రయత్నంచేస్తే మనలోవున్న సంగతి, మనలను తయారుజేసే సంగతిని చెప్పగలదు. మనం జీవిస్తున్నాం. అయితే మనకు జీవితంఅంటే ఏమిటో తెలియదు. మనకు స్వేచ్ఛవున్నది. కాని అదేమిటో మనకు తెలియదు. చాలా భాషల్లో స్వేచ్ఛకు పదమనేది లేదు. ఆ భావనే మృగ్యంగా వుంటుందన్నమాట. అనుకరణలలో వ్యక్తిత్వంయొక్క స్వేచ్ఛకు, వర్గానికిచెందిన

వ్యక్తి స్వేచ్ఛకు ఎప్పుడూ గండం రాజ్యంగానే వుంటుంది. (వ్యక్తి యొక్క స్వేచ్ఛాధికారాన్ని గమనించలేని స్థాయిని చెందిన వారుకూడా వర్గంయొక్క స్వేచ్ఛాధికారాన్ని అర్థంచేసుకో గలుగుతారు.)

వ్యక్తికి సంబంధించినంతవరకు స్వేచ్ఛ, స్వాతంత్ర్యాలు ఎంతవరకు వున్నదీ తెలుసుకోవటం శతాబ్దాల తరబడి పాశ్చాత్య నాగరికతగల జాతులు విశ్వప్రయత్నాలు జేసినవి. గతంలోను, ప్రస్తుతం ఆలోచనాపరులు ఇచ్చిన నిర్వచనాలను పోల్చిచూస్తే, ఇప్పటికైన దాన్ని గూర్చి కొంత స్పష్టంగా తెలుస్తున్నది. స్వేచ్ఛయొక్క నిర్వచనం అసంతృప్తిగా వుండక తప్పదని తెలుస్తున్నది ఇటువంటి అసంతృప్తిగల అనేక నిర్వచనాలవల్ల అది మూలసిద్ధాంతానికి సంబంధం అసందిగ్ధ అర్థములను మాత్రమే తెలియచేస్తుంది. వ్యక్తులు, నిర్ణయాలను చేయుటకు అవకాశముండే కాలమానంలో స్వేచ్ఛవుంటుంది. నిర్ణయాలు విమర్శనాదృష్టితో, హేతువాదదృష్టితో జేసినవిగా వుండాలి. అట్టి నిర్ణయాలను అమలుపెట్టుటకు వీలుగా వుండాలి. అక్కడ స్వేచ్ఛవుంటుంది

స్వేచ్ఛలో వ్యక్తియొక్కశక్తులు యిమిడివుంటాయి. మనకు తెలిసినంతవరకు అవి మన జ్ఞానంమీదే ఆధారపడి వుంటాయి. స్వభావస్థితిని ఆచరణలో పెట్టగల బాహ్యపరిస్థితులుకూడా స్వేచ్ఛలో మిళితమై వుంటాయి. స్వేచ్ఛను గూర్చి పరిశోధన జేసేటప్పుడు, మనస్సు గుణాన్ని, మానవుడు నివసించే సమాజంయొక్క రకాన్ని గురించి తప్పక ఆలోచించాలి. మానవునకు చెందినంతవరకు, మనకు సంబంధించినంత

వరకు సంపూర్ణాధికారంగల హద్దులేనటువంటి స్వేచ్ఛమాత్రం లేదు. మన జ్ఞానదృష్టి పరిమితంగా వుంటుంది. గనుక, వారు పొందునట్టి ప్రతిదీ అంటే స్వేచ్ఛకూడా పరిమితంగానే వుంటుంది. పరిమితంగావున్న మన శారీరకపనులవలె వుంటుంది. మన కంటిచూపు స్వల్పమైనది. అయినా మనం చూడగల్గు తున్నాం. మన వినికిడిశక్తికూడా మితంగానే వుంటుంది. అయినా మనం కొంతదూరంనుంచి వచ్చేశబ్దాలను వినగలుగు తున్నాం. మన జీవితంకూడా స్వల్పమే కాని మనంజీవి స్తున్నాం. "మానవుడు సహేతుకంగానే వుంటాడు. అయితే అతనిని అర్థంచేసుకోనటంలో మానవస్వభావం వంకరగా వుంటుంది" అన్నాడు హ్యూమ్. మానవుడు స్వేచ్ఛగా వుండు టకు శక్తివున్నదని స్థిరపడినతరువాత, వానియొక్క స్వాతంత్ర్య హద్దులు ఏమిటో మనం తెలుసుకోవాలి.

రెండు భిన్నమైన స్వేచ్ఛలు తారుమారుగా వుండునని తరుచు లిబరల్స్ గుర్తుపెట్టుకోవాలి. ఒకటి వ్యక్తికి చెందినది. మరొకటి వర్గానికి చెందినది. (స్థానికంగావుండే జనులు, వర్గము లేక యస్టేటు, సంసారము లేక సమాజము) స్పష్టంగా తెలియు టకు, తారుమారులేకుండా వుండుటకు, మొదటిదాన్ని స్వేచ్ఛ అని పిలుస్తారు. రెండవదాన్ని స్వతంత్రత అంటాను. మలయన్, ఇండోనీషియన్ జాతీయవాదులు మాట్లాడేదాంట్లో వ్యక్తి అధికారం మృగ్యం. మలయన్, ఇండోనిషియన్ జాతుల స్వాతంత్ర్యాన్ని బలపర్చమని వాళ్ళ అర్థం. అధికారంలోను, నిరంకుశత్వంలో ఏర్పర్చబడిన సమాజాలద్వారా వ్యక్తి స్వేచ్ఛను నశింపజేసి, మొత్తం వర్గంమీద పెత్తనం వహించే

సంఘాన్ని సృష్టించి, అదికూడా స్వతంత్రం అని నిర్వచనం చెబుతారు.

19వ శతాబ్దపు ఐరోపావాసులజాతి స్వాతంత్ర్యం వ్యక్తి స్వేఛ్ఛలో కలిసివుంటుందని తరుచు అనుకుండేవారు. ఈ రోజు కూడా యింకనూ అమెరికావారు యిదే నిజమని అనుకుంటారు. (స్వాతంత్ర్యం యొక్క మొదటిఫలితం ఏమిటని చూస్తే, నియంతృత్వాన్ని స్థాపించటం. గత పన్నెండు సంవత్సరాలలోను స్వాతంత్ర్యం పొందిన దేశాలు యిదే పనిని అవలంభించినవని తెలిసినది. యిది చూస్తుంటే అమెరికా వాళ్ళకు ఆశ్చర్యంగా వుంటుంది. 19వ శతాబ్దపు చివర చాలా వరకు ఐరోపా దేశాలలో వున్న స్వేఛ్ఛాసమాజాలకు, జాతీయవాదం పెద్ద ప్రతిబంధకంగా వున్నది. ఆ జాతీయవాదులవల్ల 1919 నుంచి 1945 వరకు, మధ్య, దక్షిణ ఐరోపాలో వున్న స్వేఛ్ఛాసమాజాలు కూలిపోయినవి. రెండవ ప్రపంచయుద్ధానంతరం జాతీయత స్థావరంగా ఏర్పడిన అన్ని దేశాలలోను స్వేఛ్ఛ దిగజారిపోతున్నది.

చాలవరకు మానవజాతి స్వేఛ్ఛను, యధార్థంతో ముడిపెట్టి నమ్ముతారు. (అధ్యాత్మికం లేక భౌతికం ముక్తికి అదే మార్గమని అర్థంచేసుకుంటారు.) మానవుడు యదార్థాన్ని అంగీకరిస్తే, స్వేఛ్ఛగావుంటారు. వ్యతిరేకిస్తే స్వేఛ్ఛలేకుండా వుంటాడు. ఈ భావాన్ని మధ్యయుగపు ఐరోపాలో విస్తృతీకరించారు. దీన్నిగురించి తర్జనభర్జన చేయవలసిన అవసరం వున్నది. అనేకమంది దీన్ని ఆధారంగాచేసికొని కట్టుబడి

వుంటారు. వ్యక్తియొక్క స్వేచ్ఛను అదుపులో వుంచుతూ జీవించటానికి ఆలోచనకు సంధిగా అప్పుడు చెప్పినది. (ఇప్పుడు అనేకమంది కమ్యూనిస్టు విజ్ఞానులకు అదే చెబుతున్నది.) ఆ చెప్పినటువంటి జీవితమార్గం, ఆలోచనను అంగీకరించని వారి స్వేచ్ఛను గుర్తించదు.

ఈ భావం ఈ రోజున ఒకొక్కప్పుడు స్పష్టంగాను, మరొక్కప్పుడు అసందిగ్ధంగాను వుంటున్నది దాన్ని అభివృద్ధి జేసిన మధ్యయుగాలనాటి పాశ్చాత్య ఆలోచనతో సంబంధం లేదని చెప్పేవారికి కూడా యీ భావం నచ్చుతున్నది. మానవుని విజ్ఞానదృష్టి, యిప్పుడు, యిదివరలోను వున్నట్టి ఆధారాన్ని బట్టి చూస్తే, "నాకు నిజం తెలుసు" అని సగర్వంగా చెప్పేవారిలో కూడా సోటువాదదృక్పథం చాలా పరిమితంగా వున్నదని తెలుస్తున్నది. తార్కికదృష్టితో కాకుండా, మరొకదానిద్వారా యదార్థాన్ని కనుగొంటే, అది ఎప్పుడూ తెలియనటువంటి యదార్థంగానే వుండిపోతుంది. వ్యక్తి యదార్థాన్ని కనుగొంటే అది చెల్లుతుందిగాని, అన్యులకు చెల్లదు. అది అతి నమ్మకంగల పిడివాదం అని కూడా చెప్పవచ్చును. జోరాస్టరు, గౌతముడు కాకుండా, క్రీస్తుపూర్వం 6 వ శతాబ్దంలో పైలూగరస్ చెప్పినది యదార్థమని స్పష్టంగా తేలిపోయింది. అట్లాగే ఒహాహుల్లా, మార్క్సు కాకుండా, 19 వ శతాబ్దంలో స్పెన్సర్ చెప్పినది కచ్చితంగా నిజమేనని తెలిసినది.

నిర్ణయాలు చేయుటకు వ్యక్తియొక్క అధికారానికి పూచీయిచ్చే ముఖ్యమైన షరతులను గుర్తిస్తూ, నగ్నసత్యాన్ని కనిపెట్టుటకు తాళంచెవి మావద్ద వున్నదని నమ్మేవారి నమ్మ

కాన్ని నిరాకరిస్తూ, మితంగా వుండేదానిమీద లిబరలిజం ఎక్కువ వక్కాణించాలి. మానవుని పరిమితులు, అసంపూర్ణత ఎల్లప్పుడూ గమనంలో వుంచుకుంటూ, ఓర్పు సహనాన్ని లిబరలిజం చెప్పాలి. యితరులనుండి లిబరల్ ఆశించేదేమిటంటే, సమానమైన ఓర్పు మితంలో వుండాలని, స్థిరమైన క్రమమైన సమాజాన్ని పోషిస్తూ, వివిధ వైరుధ్యాలను సామరస్యంగా పరిష్కరించుకొని, సాంప్రదాయిక మర్యాదలను పాటించుతూ పనిచేయాలని, వ్యక్తి స్వాతంత్ర్యాన్ని ప్రాచీయివ్వగల సమాజాలతో పనిచెయ్యాలని ఆశిస్తుంది.

ఎప్పుడూ కూడా స్వేచ్ఛను సమానత్వంతో కలిపి తారు మారు చేయకూడదు. రెంటికీ అవినాభావసంబంధం వున్నది. ఎందుకంటే వ్యక్తియొక్క అన్ని స్వేచ్ఛలు, మానవుల సమానత్వంతో సంబంధం వున్నాయి. మరియు చారిత్రకంగా చూస్తే స్వేచ్ఛకోసం ఆశపడటం అనుభవంలో వాని అధికారాలనియమాల నకు వినియోగపడినది. ఈరోజు లిబరల్ సంస్కారం అర్థం, 19 వ శతాబ్దంలో వున్న అర్థమున్నమాటే. మానవుల మధ్య నుండే అసమానతను నెమ్మదిగా తగ్గించటం – అయినప్పటికి రెండూ ఒకటిగావుండవు. ఒక్కొక్కప్పుడు స్వేచ్ఛ, సమానత్వంమీద జరిగే చర్చ క్రూరత్వంగా వుంటుంది. 18, 19 శతాబ్దాలలో జరిగిన లిబరల్ విప్లవాల ఫలితంగా, అంటే వాటి ప్రభావం అన్నిజాతులమీద సాగింది. ఆచర్చ, రూసోను, మాంటెసిక్యూయూను ప్రశ్నించినది. జాకోబిన్సు మొదలు, 1791 రాజ్యాంగాన్ని సమర్థించేవారిని ఎదిరించింది. గిరోండ్‌ను ఎదురు తన్నింది. డెమాక్రాట్సునుంచి లిబరల్స్‌వరకు ప్రతిఘటించినది. ఈరోజు సోషలిస్టుమొదలు లిబరల్ ప్రజాస్వామిక వాదులను ఎదిరిస్తున్నది.

ఏకరీతిగా వుండుటకు సమానత్వమునకు వ్యత్యాసము ఏర్పర్చినప్పుడు భావాలు విశదంగా తేలినాయి. వ్యత్యాసానికి అసమానతకు తేడా నిర్ణయించినప్పుడుకూడా భావాలు స్పష్టంగానే తెలిసినవి. పండితులు, పామరులు, నమ్మకం వున్నవారు, లేనివారు, సాంప్రదాయ పాక్షికులు, రాడికల్స్, యజమానులు, కార్మికులు, అందరుకూడా రకరకాలైన వర్గాలు. అందరూ ఒకేరీతిగా వుండొచ్చు. లేక పలురకాలుగా వుండొచ్చును. మొదటిదానిలో సమానత్వం వున్నది. రెండవదానిలో అసమానత వున్నది. లిబరల్ మార్పుయొక్క లక్ష్యం ఏమిటంటే, వ్యత్యాసాలను తొలగించటం కాదు. విశేషాధికారాలను తీసివేయటం. అట్లాంటిక్ యిరుపక్కలా, కార్మికులను వ్యాపారస్తుల స్థాయికి పెంచుటకు పనిచేశారు. రెంటినీ తీసివెయ్యాలనికాదు. స్వేచ్ఛగా ఆలోచించేవారికి, నమ్మకంగల వారికి మధ్య సమానత్వంకోసం లిబరల్స్ పనిచేశారు. ఒక వర్గాన్ని రద్దుపర్చి పెత్తనం వహించుటకు కాదు.

వేరువేరు జాతులు లేక విజ్ఞానంగల మైనారిటీలు వున్నప్పుడు, మెజారిటీలతో కలిసి, వారిద్దరిమధ్యా సమానత్వంకోసం లిబరల్స్ పనిచేశారు. నిరంకుశంగా, క్రూరమైన చర్యలద్వారా నాశనం చేయుటకుమాత్రం కాదు. వలసవిధానం ఎక్కడైతే వున్నదో అక్కడల్లా సమానత్వంకోసం లిబరల్స్ పనిచేశారు. కాలనీలలో వున్నవారికి, వారి మాతృదేశానికి సన్నిహిత సంబంధంవుండేలాగున వారి స్వాతంత్ర్యాన్ని గుర్తించో, సమాన రాజ్యాంగాలుగా పెంపొందించో సేవజేశారు. సంప్రదాయ అధికారంగలవారు ఆచార్యత్వం కావాలన్నారు.

కమ్యూనిస్టు నియంతృత్వం వ్యత్యాసాలు తొలగాలని, అందరూ ఏకత్వంగా వుండాలని కోరింది.

స్వేఛ్ఛ, స్వేఛ్ఛావ్యాపారంలో, సాహసఉద్యమంలో సమానార్థం కాదు. ఆర్థికనిర్మాణవ్యవస్థకు, కావాలనే కోరికకు దగ్గరసంబంధం వున్నను, స్వేఛ్ఛకు తావులేదు. మానవుని మనస్సును, వాంఛను మార్పుకల్గించే ఆర్థికవ్యవస్థ మూలపదార్థాలలో ఒక్కటిగా లిబరల్స్ గమనిస్తారు. ఒక వందసంవత్సరాలక్రితం ఐరోపా పారిశ్రామికసంఘాలనుగురించి మార్క్స్ చెబుతూ, ఆస్తిని కలిగివున్నవారు స్వేఛ్ఛగా వున్నారని లేనివారు లేరని చెప్పినమాట యదార్థం. అయితే అతడు తార్కికదృష్టిలేకుండా, స్వంతఆస్తిమీద వుండేహక్కును తీసివేస్తే ఎక్కువ స్వతంత్రతను పొందవచ్చునని భావించాడు. ఆస్తిమీద హక్కువుండటం, వ్యక్తిస్వేఛ్ఛకు బలం కలిగించటం అనిచెప్పిన లాక్, టర్‌గాట్, జఫ్ఫర్‌సన్‌లతో లిబరల్సు అంగీకరిస్తారు. కనుక ఆస్తిని తీసివేయకుండా వ్యాపింపజేయటం ముఖ్యం.

అధికారాన్ని కేంద్రీకృతంచేయటం లిబరల్స్ ప్రతిఘటిస్తారు. అది స్వేచ్ఛకు శత్రువు. రాజకీయాధికారం, ఆర్థికాధికారం విడివిడిగా వుండాలని కోరుతారు. అలాగే చర్చి, రాజ్యం విడిగా వుండాలి. ఉత్పత్తిసాధనాలమీద వ్యక్తికి అజమాయిషీ వుండటం, ఆర్థికరంగంలో వ్యక్తికి స్వేఛ్ఛవున్నదని తెలుపుతుంది. మిగతారంగాలలోకూడా అందరితోబాటు సమానత్వం వుండాలని కోరుతుంది.

సమిష్టిగా వుండేవారు ఒకొక్కప్పుడు స్వేఛ్ఛను

విస్తారముగావుండే వస్తుసముదాయంలో ఒకటిగా చూస్తారు, ఉత్పత్తి ఎక్కువగా వుండాల్సిందే. అది తప్పక అవుసరం. లిబరలిజానికి రాజకీయ ప్రాముఖ్యత వచ్చినప్పటినుంచి, లిబరల్స్ అందుకోసం ప్రయత్నం చేశారు. కాని శ్రేయస్సనేది స్వేచ్ఛకు ఒక మెట్టుమాత్రమే. వ్యక్తియొక్క వ్యక్తిత్వాన్ని విశాలంచేసినట్లయితే, లిబరల్ పనిచేసినట్లుగానే భావించాలి. బానిస బలుపుగా వున్నంతమాత్రాన్న అతని హోదాలో మార్పువీమాత్రం వుండదు. సంపద, స్వేచ్ఛ రెండూ సమానార్థకంగానే వుండునసేటువంటి భావాన్ని, సమిష్టిగా లేనట్టి వారు అంగీకరించారు. మూడవశతాబ్దంలోని నిరుపేద రోమన్ పౌరుని, వాని సమకాలికులైన కార్తజీనియన్ భాగ్యవంతులను లేక 16 వ శతాబ్దపు పశ్చిముష్టివాండ్రను, మొగల్సామ్రాజ్యములోని పౌరులను గమనిస్తే పైసంగతి విశదపడుతుంది.

ఈరోజు స్వేచ్ఛను పెంపొందించాలంటే, జీవితప్రమాణాన్ని పెంచాలని అనేకమంది విశ్వాసంగా నమ్ముతారు. అన్ని తరగతులవారి జీవితప్రమాణం హెచ్చుగా వున్నను, 1900 నాటికన్నా 1940లో జర్మన్‌జాతి తక్కువ స్వేచ్ఛలో వున్నారనే యీ 20 శతాబ్దపు నగ్నసత్యాన్ని గమనించరు. అట్లాగే 1945 సం॥ నకు పూర్వం జపానుజాతి యొక్క 20 శతాబ్దపు సామ్రాజ్యాన్ని పట్టించుకోరు. ఈ రోజునవున్న అనేక జాతులను కూడా గమనించారు. సంపద రంగువంటిది. ఆ రంగులు అందంగా వుండటం, అంద విహీనంగా వుండటం, వాటిని ఉపయోగించే చిత్రకారునిమీద ఆధారపడివుంటుంది. సంపదనేది స్వేచ్ఛకాదు. నిరంకుశత్వం కాదు. దానిని

ఉపయోగించటంలో వుంటుంది. అప్పుడు అటుగాని యిటుగాని పోతుంది.

ఒకొక్కప్పుడు స్వేచ్ఛను అభివృద్ధితోను, ప్రేయస్సుతోను, శాంతి సౌఖ్యాలతోను ఏకంగా చూపటం చాలా దురదృష్టకరం. అదే విధంగా స్వేచ్ఛను దరిద్రంతోను, అసౌఖ్యంతోను, తగాదాలతోను, కీచులాటలతోను ఏకంగా చూడటం కూడా దురదృష్టమే. స్వేచ్ఛ అంటే స్వేచ్ఛ. అంతకు మినహా మరేమీ లేదు. మంచికిగాని, చెడుకుగాని మానవుడు తన స్వశక్తిమీద ఆధారపడి, సమస్యలను పరిశీలించుతూ, హేతువాదదృష్టిలో పరిష్కారమార్గాన్ని కనిపెట్టాలి. దానికి స్వేచ్ఛ ఉత్పత్తిస్థానం. అది సుఖానికి, అది అంతులేని బాధకు దారితీయగలదు. దానికి యింకో పర్యాయపదం కూడా లేదు. అది మానవుని పైకి పంపగలదు. దింపగలదు.

*

## 3

# కార్యక్రమం

అన్ని దేశాలలోవున్న లిబరల్స్, మానవ ప్రయత్నాలలో జరిగే అన్ని రంగాలలోను వచ్చేటటువంటిమార్పులను, సమస్యలను, విరోధులను దిద్దుబాటు చేయుడం కష్టంగావున్నది. ఎక్కడ ఏవిధంగా చేయవలయునో వారికి విశదం కావటంలేదు. ఇదంతా కూడా స్వేచ్ఛచుట్టూవున్న తారుమారు స్థితివలన ఏర్పడుతున్నది. అదీగాక ఉత్పన్నమైన సమస్యలు, లిబరల్ కార్యక్రమంద్వారా దిద్దుబాటు చేయకపోవటం వారి అసమర్థతను, అసంతృప్తిని తెలుపుతున్నది. మరియు లిబరల్ కార్యక్రమంలో ఏది శాశ్వతం, ఏది అశాశ్వతం అనే తేడాను గమనించ లేకపోయినారు. సులభంగా దశలు మారుస్తూ ఒక్కొక్కప్పుడు నియంతృత్వానికి దగ్గరగా వచ్చేవాళ్ళు. మూడు సంవత్సరాలక్రితం అట్లాంటిక్ మాసపత్రికలో, జె. యస్. క్లార్కు వ్రాస్తూ, "స్వేచ్ఛకు కావలిసినవి, పౌరుల బాధ్యత, వ్యక్తిత్వం, ప్రోత్సాహం వుండాలన్నారు. మన సంఘానికి క్రమబద్ధమైన కార్యక్రమం (అమెరికాజాతి)ప్రభుత్వం ఏర్పర్చాలన్నారు." Adventures of Ideas అనేదాంట్లో ఎ. యన్. వైట్‌హెడ్ పెరిక్లీస్ వ్యక్తిత్వాన్ని తృణీకరించాడు. స్మిల్సు సింగరు వ్రాసిన అనేక రచనలలో లిబరలిజానికి ఒక

స్థానాన్ని యివ్వలేకపోయినారు. వలస విధానానికి నిలబడిన ఫ్రెంచి రాడికల్, అసలు లిబరలిజానికే స్వస్తి చెప్పారు.

ఎ. స్వతంత్ర సమాజంలో స్వేచ్ఛాభావాన్ని క్రమ పద్ధతిలో పెట్టిన సమాజములు ఏవి ?

బి. సమస్యలను లిబరల్ దృక్పథంలో మార్చే మార్పులు ఏవి ?

స్వేచ్ఛయొక్క వాంఛను విశదీకరిస్తూ ఒక రూపాన్ని సమాజాలద్వారా యిస్తూ ప్రోత్సహించినవారు ఏమని పిల్చుకున్నా, వాళ్ళు, లిబరల్ అనేమాట వాడుకలోనికి రాక పూర్వమే లిబరల్స్‌గా వున్నారు. యిది మూడుతరాలు పట్టింది. (Locke's Treatises నుంచి 1788 అమెరికా రాజ్యాంగం, 1791 ఫ్రెంచి రాజ్యాంగం వరకు) లిబరల్స్ యొక్క ముఖ్య ఆశయం, వారి తరువాత వారి ఆశయం సులభంగా చెప్పొచ్చు. సంఘాన్ని తిరిగి ఒక నిర్మాణాత్మకమైన పద్ధతిలో వుంచాలి. ఆ సంఘంలోని సభ్యులు, సంఘం చితికిపోకుండా వీలైనంతస్వేచ్ఛను అనుభవించుటకు వీలుగావుండాలి. లాక్ నుంచి క్రోసువరకు లిబరల్సు వ్యక్తిత్వాన్ని వర్గానికి దాసోహం చేయుటమనే సిద్ధాంతాన్ని తృణీకరించారు. అది అసాధ్యమని వారట్లు చేయలేదు. అది హానిచేస్తుందని చేశారు. పూర్తి స్వేచ్ఛను లిబరల్స్ నిరాకరించారు. అది హానిచేస్తుందని కాదు. అది వీలుకానట్టిది. అదుపు ఆజ్ఞలు అవుసరమని, వారు గుర్తించారు.

A. స్పష్టంగా నిర్ణయించబడి, వీలైనంత విశాలంగల

విస్తీర్ణంలో, వ్యక్తి తన యిచ్ఛాశక్తితో పనిచేయుటకు అనువుగా వుండుట-

B. ఒక క్రమపద్ధతిలో అజమాయిషీ వహించుటకు అధికారాన్ని అప్రధానంగా జేసి, బాధ్యతగల పౌరులయొక్క నిర్ణయాలకు పీటుకలిగించుట,

C. నిర్ణయాలను అమలుపెట్టుటకు చక్కటి నిర్ణీతమైన పద్ధతిని ఏర్పర్చటం; ఆ నిర్ణయాలలో అవుసరమైన మార్పులు చేయుటకు ఎప్పుడూ అవకాశముండాలి. స్వాతంత్ర్యం, ముందుకు సాగిపోయే శక్తి రెండూ కలిసివుంటాయి. ఈ మూడుసూత్రాలు వుండాలంటూరు.

మొదట గ్రేటుబ్రిటన్‌లో, తరువాత అట్లాంటిక్‌లో, స్వేచ్ఛాకాముల్లో సమాజాలు, స్వేచ్ఛగావుండే సభ్యుల సమాజాలంటే ఏమిటో లిబర్‌లిజం చెప్పేటటువంటి పలుకుబడిగల శక్తివంతమైన గ్రూప్‌నిర్వచనం చేశారు. ఈ సమాజాలను ప్రచారంచేయుట లిబరల్సుయొక్క కార్యక్రమం. నెపోలియన్ యుద్ధాలువచ్చి, యూరప్ నియంతృత్వ చీకటిలో పడక ముందు యూరప్, అమెరికాలలోని లిబరల్సు కొన్ని సందర్భాలలో ఈ కార్యక్రమాన్ని ప్రచారంచేశారు. తదుపరి రెండుతరాలపాటు 1815నుంచి 1875వరకు, అట్లాంటిక్ యిరుపక్కలా, నిగూఢమైన సాంప్రదాయ నియంతృత్వంలో, విజ్ఞానవంతమైన రాడికల్ నిరంకుశత్వంతోను పోరాడారు. స్వేఛ్ఛను ఆధారంగా తీసికొని జాతులజీవితాన్ని నిర్మించాలని చెప్పారు. 19 వ శతాబ్దపు చివరిదశలో, టర్కీ, రష్యా, ఇండియా, చైనా,

జపాను, మెడిటిరేనియన్, పసిఫిక్ లమధ్య చిన్న దేశాలలో ఈ కార్యక్రమాన్ని లిబరల్సు చెప్పేవాళ్ళు. అప్పుడు లిబరల్సు ప్రతిచోటా పెరుగుతున్నారు. వారి కోర్కెలను, ఆశయాలను ఆధారంగా చేసికొని, లిబరలుసమాజాలను ఈ క్రిందివిధంగా విభజింపవచ్చును.

1. నైతిక సమానత్వం :

ముఖ్యంగా విశేషాధికారం గలహక్కులను ఎత్తివేయటం, న్యాయం, శాసనం సమానత్వంవుండుట, సమానమైన అవకాశాలు, అందరికీ విద్య అన్నిరంగాలలోను అర్హతనుబట్టి ప్రవేశించటం.

2. వ్యక్తిస్వేచ్ఛ :

కారణంలేకుండా విచారణలేకుండా నిర్బంధంలోవుంచుట, బానిసత్వాన్ని, వెట్టిచాకిరిని నిర్మూలను చేయుట, న్యాయ విచారణ నిష్పాక్షికంగా జరుగుట.

3. వాక్స్వాతంత్ర్యం :

వాక్సభాస్వాతంత్ర్యాలు, పత్రికా స్వాతంత్ర్యం-మతం, విద్య, ప్రచారం ఆటంకంలేకుండా సాగుట - మానవుడు సాంఘిక జంతువగుటవలన లోలోన స్వేచ్ఛను ఒక పరిమితిలో పెంపొందించును - అది బాహాటంగా చెప్పుటకు స్వేచ్ఛ నిచ్చుట.

4. రాజకీయస్వేచ్ఛ :

నిర్బంధంలేకుండా స్వేచ్ఛగా ఎన్నికలుజరుగుట, సమావేశాలకు, సమాజాలకు పూర్తిస్వేచ్ఛ నిచ్చుట, చర్చల ద్వారా నిర్ణయాలుచేయుట, స్వేచ్ఛగా ఎన్నికయిన ప్రజా ప్రతినిధులచే నిర్ణయాలను అమలుపర్చుట, స్థానికపరిపాలనాధికారము కొనసాగించుట –

5. పరిమితి లేక రాజ్యాంగంచే నియమింపబడిన ప్రభుత్వం:

రాజకీయాధికారాన్ని వికేంద్రీకరణం చేయుట, లెజిస్లేటివ్స్, యక్జిక్యూటివ్ల మధ్య పంచుట, మెజారిటి, మైనారిటి హక్కులను పరిమితంచేయుట, న్యాయవిచారణ న్యాయస్థానాలకు స్వేచ్ఛయిచ్చుట, అవసరమైన, శాసనాలను మార్పుచేయుట, ప్రశాంతంగా అమలుజేయుట–

6. చర్చిని, స్టేటును ప్రత్యేకంగా వుంచుట :

మతనమ్మకాలతో, విశ్వాసాలతో కూడిన సమాజములను స్వతంత్రంగావుంచుట, అధికారాన్ని రెండింటిమధ్య వికేంద్రీకరణచేయుట,

7. ఆర్థికవిధానం - స్టేటు - ప్రత్యేకంగావుంచుట:

స్వంతఆస్తి హక్కును ఉత్పత్తివిధానాలను వ్యాపింపజేయుట, ఉత్పత్తిసరుకులను స్వేచ్ఛగా నిర్బంధం లేని మార్కెటులలో అమ్ముకొనుట, రాజకీయ ప్రజాస్వామిక ఆర్థికవిధానాలను అమలులోబెట్టుట.

పైన చెప్పినప్రకారం కార్యక్రమాన్ని ఆధారం చేసి కొని అట్టి పద్ధతిని స్థాపించి, పోషించితే, అభివృద్ధి చెందుటకు వీలుంటుందని లిబరల్స్ యొక్క గట్టి నమ్మిక. ఎక్కడైతే నిరంకుశ సమాజాలున్నవో, వాటి నిర్మూలనకోసం లిబరల్స్ పని చెయ్యాలి. సాంప్రదాయవాదులు, జాతీయవాదులు, సమిష్టిగా వుండేవాళ్లు పరిమితులలో వుండేలాగున చెయ్యాలి. నియంతృత్వాన్ని తొలగించి మంచి సాంప్రదాయాన్ని నెలకొల్పాలి. ఈ విధంగా అనేకమార్లు యూరప్‌లో జరిగింది. స్వేచ్ఛా సమాజాలలో ఉత్పన్నమయ్యే సమస్యలకు లిబరల్ మార్గం వున్నది. చారిత్రికసాక్ష్యం ఒక ప్రధానమైన నిబంధన వున్నదని తెలుపుతున్నది. అసమానతను తొలగించుటకు లిబరల్స్ ఎప్పుడూ ప్రయత్నం చెయ్యాలి. అసమానతను తక్కువజేసిన కొద్దీ, పరిష్కారమార్గం వస్తుంది. ఇది ఆర్థిక, విద్యా, మత సంబంధమైన చిక్కులకు వర్తిస్తుంది. స్వాభావసిద్ధంగా స్వేచ్ఛలోనే వ్యత్యాసాలను ఉత్పత్తిచేసే గుణమున్నది. వాటివలన అసమానతకు దారితీయవచ్చును. విశేషాధికారాలు రావచ్చును. స్వేచ్ఛా సమాజాలను నాశనం చేయవచ్చును. ఒకసారి స్వేచ్ఛాసమాజాలు స్థాపించబడిన తరువాత, స్వేచ్ఛకోసం పోరాటం, స్వేచ్ఛచే ఉత్పత్తిచేయబడిన వాటితో నిరంతరం పోట్లాడవలసి వస్తుంది. ఇదంతాకూడా పురాతన మధ్య యుగాల, నవీన కాలాలలో ఏర్పడిన ప్రజాప్రభుత్వాల అనుభవంవల్ల తెలుస్తున్నది.

గడిచిన తరాలలో, స్వేచ్ఛ ముఖ్యంగా అభివృద్ధిని, శ్రేయస్సును, సౌఖ్యాన్ని, ఐకమత్యాన్ని తెస్తుందని లిబరల్స్

యొక్క గట్టి నమ్మిక. ఈవిధమైన ఊహాలు వచ్చుటకు, సమర్థించుటకు, ముఖ్యంగా, డెస్‌కార్టెసన్, న్యూటన్, 17 వ శతాబ్దపు శాస్త్రజ్ఞులు, ధైర్యంతో, ఉత్సాహంగా, శక్తివంతంగా చేసిన ప్రబోధాలే. పాశ్చాత్య తాత్వికవాదులుకూడా ఈ విధంగానే ప్రబోధం జేశారు. లిబరల్స్‌ను బలపర్చింది. శాశ్వితమైన మార్గాన్ని అన్వేషిస్తున్నామనే నమ్మకాన్ని కల్గించింది. దేవుడు, దయ్యం, మూఢనమ్మకాలకు బదులు, ప్రకృతి, మానవులచే తయారుజేయబడు శాసనాలు, తార్కిక దృష్టి ప్రవేశ పెట్టబడినది.

అయితే ఈ నమ్మకానికి ఒక బలిహీనతకూడా వున్నది. మంచిని–చెడును, తగాదాను, ఐక్యతను, ధర్మాన్ని అధర్మాన్ని, స్వేచ్ఛ ఉత్పత్తిచేస్తుం దనేవిషయాన్ని లిబరల్సు ఎదుర్కోవలసివచ్చింది. 19 వ శతాబ్దంలో, కొద్దిమంది లిబరల్స్ మాత్రం, స్వేచ్ఛను మానవుడు ఉపయోగించుకొని, మంచిని తయారుచేయుటకు ఒక్క షరతని గమనించారు. మంచి చెడు అనేటటువంటిది మానవుడి ప్రయత్నంమీాద ఆధారపడి వుంటుంది.

గడచిన 350 సంవత్సరాల చరిత్రనుచూస్తే, మోడరన్ లిబరలిజం కొన్ని ఉత్తరఅట్లాంటిక్ జాతులలో జనించినదని తెలుపుతున్నది. అచ్చట దౌర్జన్యమైన, క్రూరమైన మతకక్షలతో బాధపడ్డారు. వాటి ఫలితంగా మోడరన్ లిబర్‌లిజం ప్రారంభించబడ్డది. మానవసమాజాలను సరిదిద్దటంలో సహాయపడుటకు మొదట్లో లిబర్‌లిజం పరిమితంగా వున్నను, 20 వ శతాబ్దం ప్రారంభదశ వచ్చేసరికి గొప్పస్థాయికి వచ్చింది.

మానవశక్తులకు స్వేచ్ఛ కల్పించి, స్వేచ్ఛను ప్రోత్సహించటంలో వచ్చిన అనేక సాధనాలకథ అనికూడా చెప్పవచ్చును. ఆశ, నిరాశ, హేతువాదం, మూఢత్వం, నమ్మకం, అపనమ్మకం, జాతీయవాదం, అంతర్జాతీయవాదం, పెట్టుబడిదారీ విధానం, సమిష్టిసముదాయం, ఫాసిజం మరియు కమ్యూనిజం, స్వేచ్ఛాసమాజాన్ని ఏవిధంగా నిర్మించాలో లిబరల్సు తెలుసుకున్నారు. 18, 19 వ శతాబ్దాలలో ఎన్ని విప్లవాలు వచ్చినా, ఎన్ని ఉద్యమాలువచ్చినా, మార్పులు కలిగినా లిబరల్సు విజయం సాధించారు. అన్ని దేశాలలోను సాంప్రదాయ సర్వాధికారాన్ని బలహీనత పర్చారు. స్వేచ్ఛవల్ల పొందిన లాభాల వల్ల, స్వేచ్ఛనే నిర్మూలించే ఫలితాలను ఏవిధంగా పట్టుకురావాలో వారు తెలుసుకోలేరు. లిబరలిజంవల్ల వృద్ధించిన వ్యతిరేకశక్తులు, జాతీయవాదం, ఫాసిజం, క్యాపిటలిజం, కమ్యూనిజం దౌర్జన్యశక్తులకు ఏవిధంగా ఎదిరించాలో లిబరల్సుకు తెలియలేదు. 1941 నాటికల్లా యీశక్తులు, యిరోపా ఖండంలో, మూడు చిన్న రాజ్యాలలో తప్ప, స్వాతంత్ర్యాన్ని నాశనంచేసినవి. ఈరోజున అనేక దేశాలలో యీశక్తులు విలయతాండవం చేస్తున్నాయి.



# స్వేచ్ఛపాత్ర

మానవుడు బలహీనమైన పునాదిలేనట్టి జంతువుగా పరిగణింపబడినప్పటికి, కొన్నివందల వేల సంవత్సరాలనుంచీ మానవుని వునికి వున్నప్పటికి, అతనిని ఎదుర్కొన్న భయంకరమైన సమస్యలన్నిటిని తొలగించుకుంటూ, జీవించటంమాత్రమే గాకుండా, తననుగురించి చక్కగా పనిచేశాడు. కండపుష్టి, ప్రాచీన జీవితంలో నిత్యా ఉత్పన్నమయ్యే కష్టాలను ఓర్పు వహించటంలో సామర్థ్యం లేకపోయినను, యితరజంతువుల కన్నా, మానవుడు హేతువాద, విమర్శనాదృష్టిని పొంది వున్నాడు. పరిస్థితిని గ్రహించటంలో అతనికి ఎక్కువ సామర్థ్యం కలదు. సంబంధ బాంధవ్యాలను ఊహించగలడు; చిక్కులను ఫలితాలను కనిపెట్టగలడు; హేతువాదమార్గంతో సమస్యలకు పరిష్కారమార్గమును కనిపెట్టి, జీవించుటకు అనువగు మంచి పరిస్థితులను ఏర్పర్చుకొనును.

ఇతర మానవులు లోగడ అనుభవించిన చిక్కులకు, సమస్యలను నిర్వాహించవలసి వచ్చినప్పుడు, మానవుని తార్కికదృష్టిని సూత్రములచే నడిపించవచ్చును. (భావాల ద్వారా, ముఖ్యసూత్రములద్వారా, పద్ధతులద్వారా) ఆ సూత్రములు న్యాయసమ్మతంగలవేనని లోగడే స్థిరపడి

వుండాలి. అయినా మనం నివసించే ప్రపంచం కదలని మొద్దు కాదు. స్వతంత్రంగా మానవుని వాంఛలు, చేష్టలు, అతని చుట్టూ వుండే వాతావరణం నిరంతరం మార్పులు చెందు తూనే వుంటుంది. చెరువులు ఎండిపోవచ్చును; భూములు ఫలించకపోవచ్చును; చలికాలం చలిగా ఎండాకాలం వేడిగా వుండొచ్చు. పచ్చికబయళ్ళు, ఎడారులు, అడవులు ముందుకు పోవచ్చును; వెనక్కురావచ్చును. జంతువులకు, పంటలకు వ్యాధులు రావచ్చును. మానవస్వభావాల్లో పరిణామాల్లో నిర్మాణంలో మార్పువస్తుంది. ఎప్పుడూ ఒకే తీరుగావుండదు. ప్రశాంతంగావుండే బిడ్డ అల్లరివాడుగా మారుతాడు. కార్మి కుడు పనిచేయుటకు పనికిరాకుండా పోతాడు. నూతన అవాం తర పరిస్థితులు ఎదురైపిలేకుండా వచ్చును. కొత్త సమస్యలు వచ్చును. కేవలం గతంలో జరిగిన మంచినే ఆధారంగా తీసికొన్న ప్రయోజనంలేదు. అదొక్కటే మార్గంకాదు. అనేక సమాజాలు పడిపోయిన సంగతి మనకు యదార్థంగా తెలుసు.

కొత్త పరిస్థితిని అర్థం చేసికొనుటకు, కొత్తసమస్యకు పరిష్కారమార్గం కనుగొనుటకు విమర్శనాదృష్టి హేతువాద దృక్పథం అవుసరం. దానికి స్వేచ్ఛకూడా అవుసరం. మానవుని విజ్ఞానదృష్టి దుఃఖపూరితం, అభేద్యమైనది కాదు. అన్నిరకా లైన వత్తిడికి అది అతి సున్నితంగా వుంటుంది. భయం తగ్గిన కొద్దీ, వత్తిడి తగ్గుతుంది. విమర్శనాదృష్టిలేని సూత్రాలను, బలవంతంగా రుద్దినటువంటి వత్తిడిని తగ్గించవచ్చును. మానవుని మేధస్సు వికాసంజెంది, విశాల దృక్పథంతో, చాతుర్యంతో,

సామర్థ్యంతో కొత్త పుంతలను, కొత్త మార్గాలను, కొత్త ఫలితాలను కనుగొనుటకు వీలుండును. నూతన మార్గాన్ని కనుగొనటం మన మనస్సుయొక్క ప్రధానమైన గుణం. అది స్వేచ్ఛతో కలిసిపోయి వుంటుంది. అది మనం జీవించటానికీ, విజయం పొందుటకు ఆదర్శప్రాయంగా వుంటుంది.

మానవుని విజ్ఞానదృష్టిని భయపెట్టుటకు తరుచు ఒక కట్టుబాట్లు. విమర్శనాశక్తి వుంటుంది. అయితే పైకి కనపడదు. కట్లను తీసివేసిన వెంటనే హేతువాదదృష్టి ఉత్సాహంతోను, శక్తివంతంగా ముందుకువస్తుంది. ఆ కట్లలో సాంఘిక కట్టుబాట్లు అత్యంత ప్రధానమైనవి. సముదాయాన్ని ఒకటిగా వుంచుటకు వాటి అవసరం ఎంతైనావున్నది. అవి లేనిదే వ్యక్తికూడా వుండలేడు. అయితే అదీ పీడనంగా వుండొచ్చు. హింసగా మారవచ్చును. మానవజాతిని అభివృద్ధిచేయటంలో అది అలాగే వున్నది. చాలా దూరంకూడా వెళ్ళగలవు. మానవుని హేతువాద దృష్టిలో అతి ప్రధానమైనది, ప్రత్యేకమైనది. సృజనాత్మక శక్తిని నాశనం చేయగలవు. రాజ్యాంగం లేనట్టి అనేక అనాగరిక సమాజాలలో యీప్రకారం జరిగింది. సరిపుచ్చుకొనే వాతావరణ పరిస్థితులకు, మార్పులవల్లవచ్చిన పరిస్థితులకు తేడా పెరిగినకొద్దీ క్షీణదశవచ్చును. చలనంలేకుండాపోయి నశించును. రాజ్యం, రాజ్యాంగం జయప్రదంగా ఏర్పాటు జేసిన తరువాత సాంఘిక కట్టుబాట్లు, అనాగరికత సంఘాల కన్నా, అధికారం ఎక్కువగును. అధికారంద్వారా, దౌర్జన్యం ద్వారా వాటిని రాజ్యాంగంద్వారా అమలులో బెట్టును. రాజ్యానికి సుస్థిరత ఏర్పడి, క్రమపద్ధతి వచ్చినప్పుడు, స్వేచ్ఛ

యొక్క సమస్య, దాని విజ్ఞానదృష్టి ప్రాముఖ్యత సంపాదించు కొనును.

ఇంకొక సమస్య వస్తుంది. మానవుడు తన విమర్శనా దృష్టిని ఉపయోగించవచ్చును. భావ స్వాతంత్ర్యం అనుభవించవచ్చును; అయితే అతడు సృష్టించేదల్లా ఎప్పుడూ అతని మనుగడకే ఉపయోగపడునని అర్థంచేసుకోరాదు. తరుచు విరుద్ధంగానే జరుగుతోంది. వివేకంగల జ్ఞానదృష్టితో చేసిన నిర్ణయాలవలన, వ్యక్తులు, సమాజాలు అనేకం నాశనం అయినవి. మానవుడు జీవించుటకు, అభివృద్ధిని గాంచుటకు ఉపయోగించే విజ్ఞానదృష్టి, స్వేచ్ఛగా మనస్సుని పనిచేయటంలోనే వుంచదనియు, తప్పొప్పులను సరిదిద్దుకుంటూ, పరిశోధనలు చేయుచూ, సరియైన ఫలితం వచ్చేవరకు పోవును.

కఠినమైన సాంఘికనిర్మాణం మానవుని సృష్టిశక్తిని తగ్గించటం మాత్రమేగాకుండా, పరిశోధనయందు నిరుత్సాహమును ప్రవేశపెట్టును. సాంఘికనిర్మాణం తేలికగా ఉన్నయెడల రక్షణలేక నిలకడలేక వ్యక్తిని తొలగించుటకు బలవంతపెట్టును. మానవునియొక్క మనస్సు ముఖ్యంగా ఉత్పత్తికి అనువుగావుంటుంది. సాంఘికపరిణామం మృదువుగా వున్నప్పుడు మానవ మనుగడకు అనేకమార్గాలు వెదుకుతుంది. లోపలా బయటా వచ్చే టటువంటి దెబ్బలను తట్టుకుంటూ, అభివృద్ధికి, పరిశోధనకు ముందుకుపోతుంది.

వ్యక్తిమీద నిర్బంధంగా రాజకీయాధికారం చేతగాని కట్టుబాట్లను తొలగించుటకు విజ్ఞానదృష్టితో ప్రయత్నం చేస్తాడు. సృష్టిశక్తిగల మనస్సు తప్పులను సరిదిద్దటంలో తగిన

రక్షణవుంటే అది ఫలిస్తుంది. ఒక నిర్ణీతమైన క్రమపద్ధతిలో నిర్ణయించబడిన సమూజములు, చట్టాన్ని, స్వేచ్ఛనిజస్వరూపాన్ని విశదపరుస్తూ, సమాజం స్వతంత్రంగా వుండును. కాని ఈ సమాజాలు అనేకరకాలుగా వుంటాయి. వీనిలో కొన్ని మార్పుచేయుటకు అసంభవంగా వుండునని మనం చూచాం. లిబరల్స్, లిబరల్స్ కానివారికి దృక్పథం వేరుగా వుంటుంది. ఇద్దరిని సమన్వయం చేయటం, రాజీ కుదర్చటం దుర్లభం. కాని లిబరల్ సమాజాన్ని స్వేచ్ఛతోను, తార్కికదృష్టితోను స్వతంత్రంగా రూపొందించవచ్చును. పౌరులచే స్వతంత్రంగా స్వేచ్ఛాయుతమైన ఎన్నికలలో ఎన్నికకాబడిన ప్రజాప్రతినిధుల ప్రభుత్వం ఏర్పచ్చుట, సమానంగా రాజకీయాధికారాన్ని పంపిణీచేయుట, ప్రజాస్వామిక ఆర్థికవిధానాన్ని మేధస్సును విజ్ఞానంతో పెంచటం, అవుసరమైన మార్పులు చేయటం, నిర్ణయాలను చేయటం, ప్రతిపక్షాలను సహించటం, మొదలగునవి. ఎప్పుడగా వీటికి పరిమితులుంటాయి. ఈవిధమైనపాత్ర లిబరలిజం వహించగలదు.



# 5

## గడచిన స్వేచ్ఛా నిబంధనాలు - నూతన పరిస్థితి

స్వేచ్ఛను క్రూరత్వంతోను, సంపూర్ణాధికారంతోను, నియంతృత్వ నిరంకుశత్వంతోను, దౌర్జన్యంతోను సామాన్యంగా పోల్చటం పరిపాటిఅయినది. ఈ నిబంధనలన్నీ కూడా రాజకీయనిర్మాణమునకు చెందినవి. నాగరికతగల సమాజాలలో, రాజ్యాంగంయొక్క ప్రధానపాత్ర రాజకీయాధికారం మీందఆధారపడుతుంది. మార్పుతేవాలనే అన్ని వుద్యమాలు కూడా దాదాపు రాజకీయవుద్యమాలుగా మారిన సంగతి ఋజువుగానే తెలుస్తున్నది. అయినప్పటికి బానిసత్వపు జయాపజయాల పరిపాలన రాజకీయ నిర్మాణంతో గాక మానసిక బానిసత్వంతో కొలుస్తారు. నియంతను సమర్థించేటటువంటి సాయుధ బలాలు వున్నప్పుడే సుస్థిరంగా నియంతృత్వం ఏర్పడుతుందని అనుకొనుట పొరబాటు. ఎప్పుడైతే నియంతయొక్క వాంఛను, ప్రజలు వారివాంఛగా భావిస్తారో, హేతువాదదృష్టిని వినియోగించరో, అప్పుడు నియంతృత్వం ఏర్పడుతోంది. ఆలోచనా శక్తిని అరికట్టి, జ్ఞానదృష్టిని తొలగించి, మనస్సును బలవంతంగా, దౌర్జన్యంగా ఏర్పర్చబడిన నిబంధనలు, సూత్రాలు, చెడ్డ మతములలోనే వినియోగపర్చటం నిరంకుశధోరణికి దారితీస్తుంది. ఎప్పుడైతే ప్రజలయొక్క మానసవికాసాలు, మన్నికాన్ని,

అన్వేషణను పోగొట్టుకుంటారో, అప్పుడు నూతన భావాలను నూతన విలువలను సృష్టించలేవు.

నాగరికత వచ్చినప్పటినుంచీ అనేక మానవసమాజాలు బానిసత్వంలో వున్నప్పటికి, మానవజాతి అంతా అభివృద్ధి గాంచుటకు, మనుగడకు ఎలా సాధ్యపడింది? కారణం సులభం; యిప్పటివరకు స్వేచ్ఛను కావాలని కోరకపోయినను, కొన్ని హద్దులలో స్వేచ్ఛవున్నది. మానవుని మనస్సును అదుపులో వుంచుటకు వినియోగించే పద్ధతులు, సాంకేతిక విషయాలను కొన్ని నిబంధనలు అడ్డుపర్చినవి.

ఇప్పటివరకు ప్రధానమైనసూత్రం ఏదని ఆలోచిస్తే నియంతృత్వంయొక్క బలహీనతే కారణంగా గోచరిస్తున్నది. దానికితోడు రాజకీయ, వైజ్ఞానిక, సాంకేతికపద్ధతులు క్రమంగా లేవు. ఒక్కొక్కప్పుడు ప్రాచీన ఈజిప్టు, చైనా నాగరికతలను చెబుతారు. అట్టి నాగరికత వ్యక్తిని వికాసం చెందకుండా, పురాతన ఆచారాలనుండి, భావాలు, విలువలు, సంప్రదాయం, సమాజాలనుండి కాపాడలేకపోయింది. అది ఒకచోటునే నిల్వవుండి నశించిపోయింది. ప్రాచీన ఈజిప్టివయనుల నాగరికతను చూస్తే, వ్యక్తి సృజనాశక్తిని పూర్తిగా చంపివేసినదని చెప్పుటకు తగిన సమాచారంలేదు. చైనావిషయంలోమాత్రం గడిచిన యిరువది శతాబ్దాలలోను, వ్యక్తియొక్క వికాసాన్ని, సృష్టిశక్తిని నిరూపించుట తరుచు కష్టంగానే వున్నదని చెప్పవచ్చు. సంపూర్ణాధికారం, నియంతృత్వం, పూర్వ సంప్రదాయం, ప్రజలందరికి అన్నిచోట్లా చేరలేదని చెప్పటం యదార్థమే. ఇప్పటివరకు ప్రాచీన కాలంలోగాని, నవీనకాలంలో

గాని, పాశ్చాత్య దేశాలలోగాని సంప్రదాయికాలయొక్క బలవత్తరమైన వత్తిడినుంచి వ్యక్తులు తప్పించుకున్నారు. ఎందు వల్లంటే అందరి మేధస్సులమీద అజమాయిషీ వహించటం అసంభవమైన విషయం.

అదీగాక అధికారంలోవున్న వర్గాలలో తగాదాలు రావటం కొంతవరకు బంధనం. సంప్రదాయికాన్ని క్రమపద్ధతిలో పెట్టటంలో వుండేలోపం. కొన్ని పరిశోధనలు మానవజాతికి జయప్రదంగానే జరిగినవి సంప్రదాయికాలుగల Republic of vinnice గత అయిదువందల సంవత్సరాలనుండి మార్పు లేకుండానే వున్నది నిరంకుశత్వాన్ని సరియైన క్రమపద్ధతిలో స్థాపించిన చోట ప్రజాసమ్మతమైనటువంటి గుబాళ్లు వచ్చుటకు వీలుండదు. కాని ఒకరాజ్యంకోసం ఇద్దరు తగాదాపడినప్పుడు, ఇద్దరు మతాధికారులు ఆచార్యపీఠంకోసం కలహించినప్పుడు, కొందరు పెద్దమనుషులు కూడి చేసే కార్యంలో ఒకవర్గం తగాదాపడినప్పుడు, క్రమపద్ధతిని అమలుజేయుటం కష్టం. ఆ సమయంలో ప్రజానీకానికి నూతనభావాలను వెదజల్లుటకు, బహిరంగంగా ప్రచారం చేయుటకు ఒకేమోస్తరు స్వేచ్ఛలభిస్తుంది.

పరిపాలించేవారిలో తగాదాలు నియంతృత్వం క్రమపద్ధతిలో లేకపోవటంవల్లనే గాకుండా. అట్టి పరిస్థితులు అట్టి పాలకులు ఎప్పుడూ వుండుటవలన యిప్పటివరకు స్వేచ్ఛ వలన గల్గింది. పాశ్చాత్యరోమన్ రాజ్యం పడిపోయినదగ్గరనుంచీ, శాశ్వతంగా విభాగం చేయబడిన యూరప్, మిగతా నాగరికతలకంటే యీ విషయంలో సుఖపడ్డదని తెలుస్తున్నది. వేరోనా, రవెన్నాలలో నియంతలను డాంటె గమనించాక

పోయినట్లయితే, బహుశ అతడు మహాసందాల్చివుండేవాడు. మార్టిన్‌లూథర్ కూడా అదేపనిచేసివుండేవాడు. నాల్గవ హెన్రీ, పదునాల్గవ లూయీ, వారి గొప్పపథకాలను అధికారాన్ని గుర్తుపెట్టుకున్నట్లయితే, వాల్తేరుయొక్క అత్యద్భుత తెలివి తేటలు వికసించివుండేవికావు. అతడు చివరకు ప్రొస్సుకన్నా నిరంకుశమైన రష్యాలో తలదాచుకున్నాడు. ఇటీవల కొంత మంది జర్మనులను, నాజీ నిరంకుశత్వంనుండి రష్యాతప్పించినది. అదేవిధంగా ఫాసిస్టు ఇటలీ, సోవియట్ క్రూరత్వంనుండి తప్పించుటకు రష్యనులకు సహాయపడ్డది.

స్వేచ్ఛయొక్క పరిస్థితులను నిలబెట్టుటకు నాల్గవ కారణం కూడావున్నది. ఇప్పటివరకు అన్నిరాజ్యాలుకూడారీజినల్‌గానే వున్నవి. ఏ వొక్కటీ పూర్తిగా ఆక్రమించుకోలేదు. వీటి సరిహద్దుల అవతల ఎప్పుడూ విదేశీయులు వున్నారు. వారి సమాజాలలోను, ఆలోచనలోను, ఆచార వ్యవహారము లలోను, నాగరికతలోను వ్యత్యాసంగా వున్నారు. సంవత్సరాలు గడిచిననూ, కాలచక్రం తిరుగుతూనే వుంటుంది. విదేశీయుల వొత్తిడివల్లనే, క్రమపద్ధతి ఎంత సమర్థనీయంగా వున్నా, రాజ్యాలుపడిపోయినవి. పడిపోయిన రాజ్యాలలో కొత్తగా ఏర్పడిన రాజ్యాలు నియంతృత్వధోరిణిలోనే పెరిగినవి. యిష్టంవున్నా లేకపోయినా, క్రూరత్వం చావు బ్రతుకులమధ్య వ్యక్తులు స్వేచ్ఛగా మనగలిగినకాలం వున్నది. ఈ కాలం కొన్ని సంవత్సరాలుగాని, తరాలుగాని వుండవచ్చును. ఒక్కొక్కప్పుడు తారుమారుస్థితి, గందరగోళం, ఆవేదన, బాధ

మిక్కుటంగా వున్నది. అప్పుడు స్వేచ్ఛగావున్న వ్యక్తులుకూడా వారి విజ్ఞానవృష్టిని వెదజల్లక, తిమ్మిరిపట్టినట్లుగా వుండిపోయినారు. కాని కొన్ని సమయములందు యీ ఉత్సాహం ప్రవాహంవలె పైకి పొంగి, కొత్తగావచ్చిన నిరంకుశత్వం స్థిరపడక పూర్వమే, మానవుని అభివృద్ధికి దోహదంచేసింది. ఇట్టి విజ్ఞానవృష్టిగల కాలాలు, పాశ్చాత్య, ఇండియన్, చైనీస్, నాగరికతలో వున్నవి. అవి స్థానికంగా ఉన్నటువంటి క్రమపద్ధతిని బయటవత్తిడి లొంగదీసినప్పుడు, అభివృద్ధికి ఆస్కారం ఏర్పడినది.

యింతవరకు స్వేచ్ఛ అవసరం లేకుండానే, స్వేచ్ఛ వుండుటకు ఆస్కారం కల్గింది. స్వేచ్ఛనుగూర్చి ప్రజలు పాటించక పోయిననూ, అమెరికా, యూరప్, ఏషియా, ఆఫ్రికా దేశాలలో అనేకచోట్ల స్వేచ్ఛ వున్నది. అసమర్థతగల నియంతృత్వం పరిపూర్ణాధికారంతో నిర్మాణం చెందినవాటిలోని తగాదాలు, నిరంకుశత్వ అధికారాలలోని వ్యత్యాసాలు, బయట వత్తిడి, స్వేచ్ఛను చూచినవి. ఇంకా చూస్తూనే వున్నాయి. నిరంకుశధోరణి, ప్రాచీన సంప్రదాయాలను పాటించటం, శాంతి భద్రతలను కాపాడేట్లుగా వుండటం — మానవుని మనుగడకు మంచివికావు.

ఈపద్ధతిలో మార్పులు యిదివరకే గోచరిస్తున్నాయి. ఇంకా రాడికల్ మార్పులు రాబోతున్నట్లు సూచిస్తున్నాయి. బాగా అభివృద్ధిజెందిన జాతులలో రాజ్యాంగంయొక్క అదుపు ఆజ్ఞలలోనికి మానవస్వభావాన్ని కట్టుబాటు చేసేటటువంటి నిరంకుశధోరణి కానవచ్చుచున్నది. ఈ పద్ధతి మానవుని విమ

ర్శనాదృష్టిని పెంచలేదు. అందరకు సమానంగా విద్యను గర పించటం, సర్వత్రా ప్రాచీన కట్టుబాట్లకు లోనుగావలిసిన రీతిగా తయారగుచున్నది. వార్తాపత్రికలు, తదితర సాధనాలు బోధనకు బదులు ఉద్దేశాలనుమాత్రమే తెలుపుతున్నవి. అనేక మంది కలిసిమెలిసి పనిచేసే ఫ్యాక్టరీలలోను, ఆఫీసులలోను, వ్యక్తి ఆర్థికవిధానాలలో మునిగివున్నప్పుడు, వ్యక్తిత్వం మీద అధికారం చలాయించే అధికారం ప్రబలంగా వున్నది. రాకపోకలను తొందరగా అభివృద్ధి చేయుచూ, సెంట్రల్ అధికారం, అసంతృప్తిని, ప్రతిపక్షాన్ని అణగద్రొక్కుతుంది. పెద్దపెద్ద బడ్జెట్లను తయారుచేసి, గూఢచారులను, ఏజంట్లను కల్పించి, పౌరులమీద రహస్యంగా నియమించింది. రాజ్యం, విద్య, ఆస్తి, ఒకే అధికారంక్రిందకు వచ్చినప్పుడు, వ్యక్తి యొక్క వ్యక్తిత్వం నామరూపాలు లేకుండా పోతుంది.

గడచిన రెండువందల సంవత్సరములలో కనుగొన్న, తెలుసుకొన్న క్రొత్తవిషయములన్నీ మానవుని స్వేచ్ఛా వికాసా ఫలితములు. అయితే యివన్నీకూడా మానవ సమా జంలో అనేక చిక్కులను పెంచినవి. ఈచిక్కు స్వాతంత్ర్య మునకు దారితీసింది. అది వ్యక్తిత్వాన్ని తగ్గించుట కుపయోగ పడింది. Gosterps, our, M V ది వ్యక్తులుచేయుచున్న అధి కారం, యింతవరకు మానవచరిత్రలోనే లేదు. అసమర్థత నియంతృత్వానికి యిప్పుడు తావులేదు.

Spencer తయారుచేసిన అభివృద్ధిమార్గం ఫలితం చూస్తూనేవున్నాం. స్వాతంత్ర్యం కల్గి, ఏవో కొన్ని వ్యాపా పాలు కల్గి, ఒకదానిరీత్యా మరొకటి ఆధారపడే సమాజాలు

ఏర్పడినవి. మానవజాతి అంతా కలిసి ఒకే ప్రపంచ సమాజంగా రూపొందవచ్చును. అది నూతన అభివృద్ధిని ప్రోత్సాహించవచ్చును. దాంట్లో అభివృద్ధినిరోధక విత్తనాలుకూడా వుండవచ్చును. ఇదంతాకూడా ఆ సమాజనిర్మాణంమీద ఆధారపడి వుంటుంది. దానియొక్క ప్రధానసూత్రం, అనైకారమూ, స్వేచ్ఛా అనేదానిమీద ఆధారపడివుంటుంది. అది వ్యత్యాసంగల సిద్ధాంతాన్ని, బయటకు తీసిని తోసివేస్తుంది. అవసరం వున్నా లేకపోయినా స్వేచ్ఛ పురోభివృద్ధికి అవసరం. ఇప్పటివరకు పనిచేయుచున్న శక్తులయొక్క ఫలితం మాత్రం స్వేచ్ఛకాదు. ప్రపంచసమాజం యేర్పడేరోజు వచ్చినప్పుడు, అభివృద్ధి, దానితోడు మానవుని మనుగడ, ప్రపంచ సమాజం యొక్క స్వేచ్ఛా స్వాతంత్ర్యాలమీద ఆధారపడివుంటుంది.

*

# 6

## లిబరలిజం స్వేచ్ఛావాంఛ

గడిచిన రెండువందల సంవత్సరాలలో పశ్చిమయిరోపా వాసులు, ఉత్తరఅమెరికన్‌లు, వారి సమకాలికుల - నాగరికత సమాజములకన్నా స్వేచ్ఛగా వున్నారు. ఈ రోజున మానవ ప్రపంచాన్ని చకితులను జేయుచున్న అనేక నూతన విషయాలను కనిపెట్టే పరిస్థితులలో వున్నారు. అయితే ఉత్తరఅట్లాంటిక్ ప్రాంతంలోవున్న జాతులు యింతకన్నా కొంచెం ముందుకు వెళ్ళారు. స్వేచ్ఛయొక్క వాంఛను ఆధారం జేసికొని స్వేచ్ఛా సమాజలను వృద్ధిజేసి, నాగరికత సమాజాలకు ఆదర్శప్రాయంగా వున్నారు.

ఇదంతా కూడా పురాతన సంప్రదాయవాసులకు, జాతీయవాదులకు, సమిష్టిసముదాయం గలవారికి వింతగా తోచవచ్చును. వీరంతా స్వేచ్ఛను స్వతంత్రంగా భావిస్తారు. వర్గాన్ని, వ్యక్తిని తారుమారుజేస్తారు. సాధారణంగా మానవ జాతికి తెలిసినది స్వాతంత్ర్యంయొక్క వాంఛ. వ్యక్తియొక్క బాధ్యతను, వ్యక్తిత్వాన్ని ముందుకు తీసికుపోవాలనే ఆశయం మాత్రం కాదు. వ్యక్తి అభివృద్ధిచెందకుండా అడ్డుకలిగించే వర్గంయొక్క బాధ్యత స్వపరిపాలనాధికారంగా వుంటుంది. 11, 12 వ శతాబ్దాలలో పట్టణాలలో నివసించే యూరోపి

యనులు కేంద్రఅధికారాన్ని వ్యతిరేకించినప్పుడు స్వేచ్ఛను కాకుండా,స్వతంత్ర్యాన్నే ప్రధానంగా కాంక్షించారు. ప్లెమిష్, ఇటాలియన్ నగరాలలోవున్న తక్కువ తరగతుల వారు, ఎక్కువతరగతులవారిని వ్యతిరేకించినప్పుడు, వారు స్వాతంత్ర్యాన్ని కావాలన్నారు. చైనాలో రేగిన కల్లోలాలు, ముస్లిమ్‌లను ఎదిరించిన మహారాష్ట్రీలు, ఝాట్సు, సిక్కులు, స్వాతంత్ర్యాన్ని కావాలన్నారు. స్వేచ్ఛాసమాజాలను ఏర్పర్చుటకు కాదు. ఒకస్వాతంత్ర్యంగాని, స్వపరిపాలానాధికారాన్నిగాని పొందినప్పుడు సాధారణంగా వర్గాన్ని తిరిగి నిర్మిస్తారు. ఆ విధంగా ఏర్పడినవర్గాలు అధికారాన్ని ఆధారంగా తీసికొనే ఏర్పడుతవి.

స్వేచ్ఛకు వాంఛలేదని దృష్టాంతరములు లేదని దీని అర్థంకాదు. కొన్ని సందర్భాలలో వ్యక్తి స్వామ్యాన్ని రక్షించేందుకు, రాజ్యాంగాన్ని తిరిగి క్రమపద్ధతిలో నిర్మించుటకు తెలివిగల ప్రయత్నాలు జరిగినవి. నిరంకుశత్వాన్ని, సంప్రదాయాన్ని ప్రతిఘటించిన వారంతా, మరియొక నియంతృత్వాన్ని వారి యిష్టానుసారం దాని స్థానంలో ఏర్పర్చుటకు చేయలేదు. స్వేచ్ఛయొక్క వాంఛ అది పొందినవారి పనులు కొంత కాలంమటుకే కొనసాగినవి. (రోమన్‌రిపబ్లిక్‌మాత్రం ప్రత్యేకింపబడినది.) ప్రాచీన మెడిటెరేనియన్, మధ్యయుగాల ఐరోపా ఖండాలలోని కొన్ని పట్టణాల రాజ్యాలు, కొన్ని రష్యన్, ఇస్లాం, ఇండియన్‌జాతులు దీనికి నాయకత్వం వహించినవి. ఇది కొద్ది కాలం బాటే కొనసాగింది. ఇవి అభివృద్ధిని సూచించే దృష్టాంతరాలు మాత్రం కావు. తెలివి

తోను, సమ్మకంతోను చేసిన ప్రయత్నంవల్ల వచ్చినది కాదు. ఈ తాత్కాలిక స్వేచ్ఛకూడా అప్పుడువుండే స్థానికపరిస్థితుల వల్ల అప్రయత్నంగా రాకతప్పిందికాదు. వ్యక్తి వాంఛకు ఆశయాలకు సంబంధంలేదు.

ఇష్టంలేకపోయినప్పటికి స్వేచ్ఛయొక్క వాంఛ నవీన నాగరికత సమాజాలలో గత మూడువందలసంవత్సరాల నుంచి ప్రాతిపదికగా వున్నది. కాని యిది వ్యక్తియొక్క భక్తి, భ్రాంతిమీాద ఆధారపడకూడదు. మానవస్వభావం, యిప్పుడు యిదివరలోను క్రమంగా ఒకవిధమైన నిరంకుశత్వం, ఆచారం, బలవంతంగా నెత్తినరుద్ది కట్టుబాట్లకు దారితీస్తున్నది. అకస్మాత్తుగా కొన్ని సంఘటనలు జరిగి యీా బలవత్తరమైన అధికారంన్నుండి మానవశక్తులను చొప్పించి స్వేచ్ఛను ప్రసాదించినవి. అభివృద్ధిజరుగుటకు వీలుగా ఆదర్శంగా ఒక అడుగు ముందుకు జరిగింది.

ఈరోజు అనేకమంది నవీన నాగరికతలో సంభవించిన వెడమార్గాలను పెడచెవినిబెట్టటమో, పట్టించుకోకుండా వుండటమో చేస్తున్నారు. స్వేచ్ఛకావాలనే ఉబలాటం, ఆసక్తి, బలవత్తరమైన వుద్యమంగా తయారైనది. కొంతకాలంబాటు మానవజాతికి నాయకత్వం వహించుటకు వీలుగా ఉపయోగపడినది. పాశ్చాత్యసమాజాలలో ప్రత్యేకంగా అక్కడక్కడ ఉపయోగపడింది. ఇంతవరకు సాంఘికంగావచ్చిన గొప్ప మార్పు ఏమిటంటే, చెడ్డయజమానిని తొలగించి, మంచివానిని నియమించుకొనుట. ఈ వుద్యమం అనేక రకాలపేర్లుతో, అనేకచోట్ల అనేక కాలాల్లో తెలియబడినది. దీనిని అమెరికా

వారు ప్రజాస్వామికం అంటారు. యూరోపియన్లు అనగానే మనకు రాబస్ పెట్రీ, నెపోలియన్, లెనిన్ గుర్తుకువస్తారు. సాధారణవాంఛకు ప్రాతినిధ్యం వహిస్తున్నామని చెబుతూ, వ్యక్తిత్వాన్ని నామరూపాలు లేకుండా చేసేవాళ్ళుకూడా దీనిని లిబరలిజం లేక లిబరల్ ప్రజాస్వామికం అని పిలుస్తారు. ముఖ్యంగా ప్రజల సమ్మతిని పాటించకుండా స్వేచ్ఛమీదే ఆధారపడితే, అది స్వాతంత్ర్యానికి మార్గం జూపినా, నియంతృత్వాన్ని, కట్టుబాట్లను సంఘటితపర్చుటకే వినియోగపడుతుంది. ఆ మార్గంనుండి తప్పితే మనం ధైర్యంతో భవిష్యత్తును ఆశించవచ్చును. లేనియెడల మానవజాతి క్రిందమీద పడుతూ వుంటుంది. ఒకసారి ప్రపంచసమాజం పడిపోయినట్లయితే, దాన్ని తిరిగి పైకి తీసికొనిరావటం దుర్లభం.

17 వ శతాబ్దంలో అట్లాంటిక్ యిరుపక్కలా వున్నటువంటి కొద్దిమంది లిబరల్సు లక్ష్యాలు మితంగాను, అర్థంగాకుండాను వున్నవి. ఆ శతాబ్దపు రెండో భాగంలో మాత్రమే, ముఖ్యంగా ఇంగ్లాండులో వర్గం బయలుదేరింది. సమాజం స్వేచ్ఛగా వుండాలంటే, స్వేచ్ఛగా జీవించటమే ప్రధానం కాదని, స్వశక్తిమీద ఆధారపడాలని, వ్యక్తి తన జీవితానికి తనే యజమానిగా వుండాలని, తోటివారి హక్కును, సహోదరత్వాన్ని గుర్తించాలని గమనించారు.

లిబరలిజం జయం పొందాలంటే రెండు మూలవస్తువుల మీద ఆధారపడినది. పైన చెప్పిన వ్యక్తిలోగాని, సమాజంలోగాని సులభంగా కాన్పించవు. అయితే అది అతి ముఖ్యమైనది.

నియంతృత్వాన్ని ఏదోవిధంగా రూపుమాపాలి. ఆ నిరంకు శత్వం రాజకీయ, ఆర్థిక, సాంఘికమైనను నిర్మూలించాలి. దానికి దారిజూపే ప్రతిదాన్నీ ప్రతిఘటించాలి. అభిప్రాయ భేదాలు వున్నా తోటిమానవుల్ని సహనంతో స్వీకరించాలి. వారు స్వేచ్ఛా సమాజాలకు అడ్డురానంతవరకు వారి ఆశ యాలు, అభిప్రాయాలతో నిమిత్తంలేదు. విడుపులేని పట్టుదల తోను, సహనంతోను పనిచేస్తే, సమాజాన్ని క్రమపద్ధతిలో నిర్మాణం చేయగలం. ఆ సమాజంలోవుండే సభ్యులను, సమాజ స్వాతంత్ర్యానికి భంగం వాటిల్లకుండా, వ్యక్తివికాసం జెంది స్వేచ్ఛగా మనగల్గుటకు ప్రయత్నం చెయ్యాలి. అప్పుడే స్వేచ్ఛా సమాజం వర్ధిల్లుతుంది.

వ్యక్తియొక్క నూత్నశక్తిని గుర్తిస్తూ, ప్రజాసమూహా మునకు చెందిన వ్యవహారాలలో ఒక క్రమమైన పద్ధతిని స్థాపిం చుటలో లిబరలిజంలో మార్పువుండదు. ఆపద్ధతి పేలుగా వుండే ట్లుగా దాని గుణాలే నిరూపిస్తాయి. పరిస్థితులనుబట్టి, సమస్య లనుబట్టి పని మారుతూ వుంటుంది. మానవజాతి విముక్తికి, లిబరలిజానికి ఒక ప్రత్యేకనిర్ణయమేమీ లేదు. అట్టిదాన్ని కోరదుకూడాను. స్వేచ్ఛనుమాత్రమే కోరుతుంది. లైసెన్సుల వల్ల, నిబంధనలవల్ల, కట్టుబాట్లవల్ల, ఆర్థికవిధానం అభివృద్ధి చెందకుండా కుంటుపడుతుందో, వాటిని సమూలంగా తొలగిం చుటకు లిబరల్సు ప్రయత్నిస్తారు. స్వేచ్ఛగావుండే ఆర్థిక చిక్కులు బాధ్యతారహితంగా ప్రవర్తించి, ప్రమాదస్థితి తెచ్చిన ట్లయితే, లిబరల్సు "కంట్రోల్సు"ను విధించుటకు ప్రచారం

చేస్తారు. యూరప్‌లోను, లాటిన్ అమెరికాలోను రాడికలిజం వల్ల, యునైటెడ్ స్టేట్స్‌లో డీలిజంవల్ల ఋజువు పరుస్తున్నాయి.

జాతులు లోబడినట్లుగా వుండే లిబరలిజయం జాతీయంగా వుంటుంది. జాతులు, యితరస్వేచ్ఛను భయపెట్టినట్లుగావుండే, లిబరలిజం అంతర్జాతీయంగా వుంటుంది. సరిహద్దు తగాదాలు, బానిసత్వం, మానవహింస, మానవుని పీక్కుతినే వాదం అనే సమస్యవున్నప్పుడు, లిబరలిజం కల్పించుకొని పనిచేస్తుంది. సంప్రదాయంగావచ్చే నియంతృత్వాన్ని రూపుమాపుతోంది. అంతర్జాతీయసంఘాలు స్టేటు సమాజాలు, పరిపాలన ఏర్పర్చి లోటుపాట్లను సరిదిద్దుతుంది. ఈ దుష్టశక్తులన్నింటిని నిర్మూలం చేసినప్పుడు, స్వేచ్ఛాసమాజాలను ఏర్పాటు చేసినప్పుడు, లిబరలిజం యూనిటీవల్ల సవిధానంగా మారుతుంది. మతసంబంధమైన చర్చలు హింసను సాగించినట్లయితే వాటిని లిబరలిజం ఎదుర్కొంటుంది. చర్చలను హింసించినట్లయితే లిబరలిజం ముందుకువస్తుంది. ఈ ప్రకారంగా లిబరలిజం ఖాయమైన విప్లవం .. మార్పులు చెందుటకు వీలుగాని సమాజాలలోనే ఖాయంగానే వుంటుంది. అవి విప్లవాన్ని ఖాయపర్చేటట్లుగా పూచీ యివ్వాలి. జీవరహితంగా వుండేటట్లు చేయకూడదు. చలనం లేకుండా వుండకూడదు.

యింత కష్టంగానే వుంటుంది. ఏరకమైన లిబరల్ ప్రజాస్వామిక సమాజంకూడా, యిట్టి కష్టాలను ఎదుర్కోవలసి వస్తుంది. అయితే వాటినన్నింటిని పక్వమైన ఆలోచనతోను, నడవడితోను పరిష్కరించాలి. నియంతృత్వం, ఫాసిస్టు లేక

కమ్యూనిస్టు, మిలిటరిస్టు, ట్రేడిషన్‌లిస్టు అయినా అది మానవ జాతి బాల్యదశకు చెందినది. నడతనుగూర్చినంతవరకు, బానిస జాతులు, బానిసత్వాన్ని సమర్థించేవారు Pharaonie ఈజిప్టియనులతో సమానస్థాయిలో వున్నారు. ఆ బాల్యదశను పెంచుటకు వీలుగాకుండా బహుళ మానవజాతి దురదృష్టమే. ఎతీనియనులు ప్రయత్నించి విఫలులైనారు. రోమనులు ప్రయత్నించి అపజయం పొందారు. 19, 20వ శతాబ్దాలలో జరిగిన లిబరల్ ప్రయత్నాలు కూడా విఫలం చెందినవి. అయినా పరిపక్వమైన దశ పొందవచ్చునని, పోషించవచ్చునని సాక్ష్యం వున్నది. స్విస్, డచ్చి, నార్త్ అమెరికన్సు, బ్రిటిష్, ఫ్రెంచి, స్కాండినేవియన్సు స్వేచ్ఛగా జీవిస్తుండే మిగతా జాతులు ఆ ప్రకారంగా ఎందుకు వుండరాదో తగిన కారణంలేదు. స్వేచ్ఛా సమాజములను స్థాపించుటకు అవుసరమైన ప్రయత్నంచేసిన, స్వేచ్ఛయొక్క వాంఛను బలపర్చిన పౌరులను ఆ విధంగా తయారుజేసిన, స్వేచ్ఛగా బ్రతుకుటకు అవకాశమున్నది.

*

# 7

## స్వేచ్ఛ ఫలితములు

మానవునకు స్వేచ్ఛ అవుసరమని, మానవజాతి మను గడకు స్వేచ్ఛ ఒక్కటే ప్రాచీయిస్తుందని యింతవరకు చెప్పు కున్నాం. లిబరల్ స్థితికి లిబరల్ ప్రజాస్వామికానికి యింత కన్నా వేరే అవుసరంలేదు. రెండుతరాల క్రితం దురదృష్ట వశాత్తు రేనాన్ (స్వేచ్ఛయదార్థంవలె వుంటుంది. దానంతట దాన్ని ఎవ్వరూ ప్రేమించరు) అని చెప్పటం యీ రోజు యదార్థంగానే వున్నది. అనేకమంది ప్రజలు కళ్ళు తెరచి ఈ నగ్న సత్యాన్ని గమనించరు. గ్రామ్యమైన మాటలో యీ మాట అర్థం, వారు పిలువబడకే ప్రవేశించేవారుగా పిలువ బడతారు. వారియొక్క ఆశయములకు దగ్గరగా స్వేచ్ఛ ఎంత వరకు అభివృద్ధికి వినియోగపడుతుందో తెలుసుకొనుట అవుసరం.

వాస్తవమైన లిబరల్ మార్గం స్పష్టంగా తేలింది. నవీన కాలంలో మానవజాతికి లిబరలిజం ఒక విప్లవాత్మకమైన శక్తిగా పరిగణింపబడుతున్నది. మానవసంఘాలను అతిగా మార్పుచేయటంలో యితర వుద్యమాలకన్నా అతి ప్రధాన మైనపాత్ర వహించినది. మానవజీవితం గడచిన రెండువందల

సంవత్సరాల క్రితం ఎలావున్నదో ఆలోచించటం మాని వెయ్యాలి. ఈరోజు ఏవిధంగా వున్నదో, సరియైనమార్పు తీసికొని వచ్చుటకు ఎలా ఉపయోగపడునో ఆలోచించాలి. దాని శక్తిని అన్నిచోట్ల చవిచూచారు. కమ్యూనిజం ప్రధాన శక్తిగావున్న రష్యాదేశాలలో కూడా చవిచూచినవి, లిబర్లిజాన్ని వ్యతిరేకించినవి. పశ్చిమయిరోపాలోను, ఉత్తరఅమెరికాలోను అమలులోవున్న ప్రజాస్వామికంను స్వేచ్ఛ చేయూతనిచ్చినది. తూర్పుయిరోపాలోను, మెడిటిరేనియన్ ప్రాంతంలో, లాటిన్ అమెరికాలోను గూఢంగావుండే సంప్రదాయ సిద్ధాంతాలను బద్దలకొట్టింది. ఏషియాలో ప్రాచీననాగరికతను కదిలించివేసింది. కొన్ని దేశాలలో ప్రాచీన సంప్రదాయాలనుండి రాడికల్ నియంతృత్వానికి దారితీసింది. మరికొన్ని దేశాలలో పర్షియానుండి సింహాళంవరకు, ఇండియానుండి జపానువరకు లిబర ప్రజాస్వామికం నూత్న జీవిత వికాసానికి దోహదం చేసింది. ఆఫ్రికాలో, దక్షిణసహారాలో అనాగరికతజాతులలో ఉత్తేజంకల్గించి, ఉదాత్తమైన ఆశయాలకోసం ముందుకు నడిచింది. లిబరల్ ప్రజాస్వామిక సమాజాలను అనుభవించే జాతులలో, ప్రజాస్వామికం, క్యాపిటలిజం, సోషలిజం, జాతీయవాదం; అంతర్జాతీయవాదం, ఐహికత్వం, మానవవాదం పుట్టినవి. మంచికిగాని చెడుకుగాని (మంచికేనని నా నమ్మకం) ఈరోజు మానవజాతి వికాసశక్తికి లిబరల్ మైనారిటి ప్రోత్సాహపర్చింది.

నాగరికత వచ్చినదగ్గరనుంచి, బానిసత్వం, ఊడిగం, [illegible]ర కట్టుబాట్లు, ప్రపంచంలో యీరోజువరకు అక్కడక్కడ

వున్నవి. పారిశ్రామిక దాస్యం పారిశ్రామిక శిల్పానికి ప్రతిబంధకంగా వుంటుంది. క్యాపిటలిస్టు సంఘాలలో దాని జోలికి పోదు. ఎందుకంటే, స్వాతంత్ర్యానుంచే క్యాపిటలిజం వృద్ధి గాంచినది. పరిపాలించేవారి ఆజ్ఞలను ధిక్కరించిన రైతాంగాన్ని రష్యాలో, చైనాలో హత్యగావించారు. దాస్యం దీనిని శాస్త్ర సమ్మతం చేయదు. సరేకూటా లేబర్ క్యాంపులలోవున్న కార్మికులు తూర్పు జెర్మనీలోవున్న కార్మికులు 1953 లో దాస్యాన్ని ప్రతిఘటించి తిరుగుబాటు చేశారు. 1956 లో పోజ్నాన్ కార్మికులు తిరుగుబాటు చేశారు.

లిబరలిజం ఎక్కడ, ఎప్పుడు బలవత్తరశక్తిగా వుంటుందో, అచ్చటల్లా బానిసత్వం, దాస్యం, ఊడిగం మటుమాయమవుతాయి. లిబరల్ వుద్యమంయొక్క వత్తిడివల్ల రష్యాలో 1861 లోను, అమెరికా 1863 లోను దాస్యానికి స్వస్తి వాచకం చెప్పినవి. లిబరలిజంవల్ల బానిసత్వం, దాస్యం తొలగిపోవును గాని సంప్రదాయం, జాతీయవాదం, కమ్యూనిజంవల్ల మాత్రం కాదు. దాస్యాన్ని తొలగించటంలో నవీన మానవుడు విజయాన్ని సాధించాడు. ఆఫ్రికానుంచి, పశ్చిమ ఆసియానుంచి దాస్యాన్ని నిర్మూలించుటకు 120 సంవత్సరాలు పట్టింది. అరేబియన్ పెనిన్సులాలోని కొన్ని రాజ్యాలలో బానిసత్వం యింకా సాగుతునే వున్నది. దీన్ని జాతీయవాదం కాపాడుతున్నది.

"జీవితంయొక్క ఆశయం మనస్సును విజ్ఞానవంతంగా చేయటం - మనస్సు వికాసవంతంగా వుండాలంటే, మనస్సు స్వేచ్ఛగా వుండాలి. ఇది మొదటి షరతు." అని నాన్

వ్రాసెను. మనస్సుకు పరిపూర్ణ స్వేచ్ఛ వుండాలి. కట్టుబాట్లు వుండకూడదు. పిడివాదం, మూఢనమ్మకాలు వుండరాదు. ప్రాచీనసంప్రదాయం పిడివాదంనుంచి మనస్సుకు స్వేచ్ఛ నివ్వటం, దర్యాప్తుకు స్వేచ్ఛగా వుండటం, విమర్శనాదృష్టిని ప్రతిబింబించటం - మానవనాగరికతను, విజ్ఞానదృష్టికి ప్రతిబింబాలు గడిచిన మూడువందల సంవత్సరాలలో శాస్త్రజ్ఞానం అభివృద్ధి జెందటంవల్లనే మానవజీవితానికి విప్లవాన్ని తీసికొచ్చింది. ప్రకృతిశక్తులమీాద అధికారం సంపాదించుటకు మానవునకు లిబరల్స ఆలోచనాశక్తి వినియోగపడినది. మొదటగా శాస్త్ర పరిశోధనలు గావించి తెలుసుకున్నారు. తరువాత సాంకేతిక పరిజ్ఞానాన్ని సంపాదించుకున్నారు. మానవమనస్సులు అధికార పూరితమైన నియంతృత్వధోరణిలో వున్నట్లయితే, ఈ నూతన పరిశోధనలకు, నూతన విషయాలను తెలుసుకొనుటకు అవకాశమిచ్చారు. శాస్త్రపరిజ్ఞానాన్ని వృద్ధిజేయటంలో పశ్చిమయిరోపియన్లు, ఉత్తర అమెరికా వారికి ఎట్టి దృక్పథంవున్నదో అదే విధంగా చైనీయులకు పర్షియనులకు మేధస్సులున్నాయి. పాశ్చాత్య నాగరికతకన్నా వాళ్ళ నాగరికత పైస్థాయిలోనే వున్నదని కొన్ని శతాబ్దములక్రితంవరకు మనకు తెలుసు. లిబరల్ ఆలోచనాశక్తిలో, నవీనశాస్త్రజ్ఞానాన్ని వృద్ధిచేసేటటువంటి స్వతంత్ర ఆలోచనాశక్తి సంప్రదాయాన్ని పాటించే చైనాలోగాని, పర్షియాలోగానిలేదు. మానవుని ఘోరకృత్యాలకు వారేరుచెప్పినట్లుగా పిడివాదం మూలమని తెలుస్తున్నది. అయినను నిస్సంశయంగా అభివృద్ధిని సాధించాలి.

లిబరల్ ప్రజాస్వామికంలో అత్యంతప్రధానమైనది

లిబరల్ ప్రజాస్వామికాన్ని అనుసరిస్తున్నవి. యిటీవల విజ్ఞానం మంచిస్థానాన్ని సృష్టించుటకు ప్రయత్నించినను, అది ఒక వర్గంగా తయారై మిగతా వర్గాలమీద పెత్తనం వహించుట వల్ల స్వేచ్ఛకు ప్రతిబంధకంగా ఏర్పడినది. కమ్యూనిజం వున్న రష్యాలో, జాతీయవాదంవున్న ఈజిప్టులో, సంప్రదాయంవున్న పేరులోను మంచిస్థానం అని చెప్పుకుంటున్నది. విజ్ఞానంమీద అధికారం సంపాదించినది. ప్రత్యేకమైన సంఘాలు భవిష్యత్తు పరిపాలనకు తర్ఫీదుయివ్వచ్చును. ఈ విధమైన విజ్ఞానభావం ఎక్కడైతే ముఖ్యంగా వుండునో, అక్కడల్లా ప్రత్యేకమార్గం పరిపాలించుటకు ముందుకురాదు.

స్వేచ్ఛ అంటే సమానత్వం కాదు. అయితే అది సమానత్వానికి ప్రధానమైన హేతువుగానే వుంటుంది. అందువల్ల మానవులందరు తమ స్వశక్తిమీదనే ఆధారపడి, వారి నిర్ణయాలను కార్యరూపంలో పెట్టుటకు వీలుగావుండును. ఎందుకనగా వారు హేతువాదదృష్టి, శాస్త్రీయదృష్టిని పొంది వుండిరి. స్త్రీ,పురుష భేదం, జాతివ్యత్యాసము, ఉద్రేకపూరితవాదాలలో వారు మైనర్లుగా వుండరు. శాసనంముందు అందరికి సమానత్వం, రకరకాల వ్యత్యాసాలుగల వర్గాలను నిర్మూలనంచేయుట లిబరలిజంయొక్క దృక్పథం. కొంతమందికి అన్నిహక్కులు వుండవచ్చును; మరికొంతమందికి లేకపోవచ్చును. తర్ఫీదు, అనుభవం, మనస్సును ఉపయోగించటంలో స్వేచ్ఛ వృద్ధిగాంచును. యింకను వ్యత్యాసాలు వున్నవాటిని ఆలోచనలోకి తీసికొనవలసిన అగత్యంలేదు. ఈ నైతికసమానత్వం అనేకమందికి వెగటుగా తోచవచ్చును. కీడుగా భావించవచ్చును. మనం

గనుక మానవుల సమానత్వాన్నే వ్యతిరేకించినట్లయితే, మనం మంచివారికోసం వెళ్ళి, వాళ్ళ అదుపు ఆజ్ఞలలో వుండవలసి వస్తుంది.

సమానత్వం కావాలని కోరుకుంటేవారిలో చాలామంది నైతికసమానత్వంలో ఉత్సాహం చూపరు. సాధారణంగా (మార్క్సిస్టు లెనినిస్టు సంప్రదాయంగలవారు ప్రత్యేకంగా) వారు ప్రతిదానికి అభ్యంతరం చెబుతారు. కాని గతంలోని లిబరల్ ప్రజాసమాజాలు, ఇప్పుడు లిబరల్ ప్రజాస్వామ్యాన్ని బట్టి నిర్ణయానికి రావచ్చును. ఎక్కడ సమానత్వాన్ని లిబరలిజంవున్న సమాజాలు సంపాదించినవి. స్వేచ్ఛ వ్యత్యాసానికి దారితీస్తుందనటంలో సందేహంలేదు. అయితే గత పదితరాల వారి అనుభవం నుబట్టి స్వేచ్ఛయొక్క ఫలితాన్ని తెలుపుతున్నది వ్యక్తిలో సాముదాయకంగా స్వేచ్ఛ వహించినపాత్రను బట్టి వ్యత్యాసాలు వచ్చును.

ఆశయాలలో భేదాలున్నంతే అభిరుచులు, విధులు పెరుగుతవి. హోదాలోని తారతమ్యం తగ్గును. ప్రాచీన ఆచారాలగల వారికి, ఛాందసులకు, సంస్కారం వున్నవారికి, లేనివారికి, ఉద్యోగస్తులకు, ఉద్యోగాలు ఇచ్చేవారికి, మధ్యవుండే భేదాలను తొలగించుటకు స్వేచ్ఛ తోడ్పడును. కాని స్వేచ్ఛాసమాజంలో ఒకవర్గం మరొకవర్గంమీద పెత్తనం చెలాయించుటకు వీలులేదు. అందరూ సమానస్థాయిలోనే వుండాలి. స్వేచ్ఛలోను, సమానత్వంలోను స్విస్ జాతి చాలాకాలంవరకు పైకిలో వున్నది. రుమేనియా లేక చైనాలోకన్నా, హాలండ్ ఫ్రాన్సులలో అసమానత తక్కువస్థాయిలో వున్నది. జాతీయవాదం

వ్యక్తి స్వాతంత్ర్యంద్వారా మాత్రమే సమానమైన హక్కులు వస్తాయని వారు గుర్తుపెట్టుకోవాలి. ఆవిధంగానే, బ్రిటిష్, అమెరికన్, ఫ్రెంచి విప్లవాలు అవతరించినవి. ఇంగ్లాండులో స్త్రీ స్వాతంత్ర్యం లేకపోయినట్లయితే Mary Wollstone crafts బోధించిన న్యాయశాస్త్రాలు వచ్చివుండేవి కావు. స్త్రీల సమానత్వంకోసం కంకణంకట్టుకొన్న పేర్లు హాల్ డెక్స్ హోల్ బాచ్, కాండోర్సెట్ వంటి మొదలగువారు లిబరల్ ఉద్యమాలలో పనిచేశారు. గడచిన శతాబ్ది సంస్కరణాలలో స్త్రీల బానిసత్వాన్ని తొలగించుటకు. న్యాయశాస్త్రముల ముందు స్త్రీలకు సమానహక్కులు వుండుటం లిబరలిజం పునాదిగా వున్నది. లిబరలిజం ఫలితంగానే ముస్లిం స్త్రీల పరదా తొలగింది. సహగమనం రద్దయినది. ఊడిగం, కట్టుబాట్లు మాయమయినవి. స్త్రీల హీనస్థితిని తొలగించుటకు, సమానత్వాన్ని సంపాదించుటకు, స్కాండినేవియన్, స్విస్, కెనడియన్, అమెరికన్ లిబరల్ ప్రజాస్వామిక పద్ధతులు ఈరోజు పనిచేస్తున్నవి. అందరూ సమానమనే సిద్ధాంతానికి బాటవేస్తుంది.

స్వేచ్ఛాసమాజాలు వున్నచోట ఆర్థిక సమానత్వం వచ్చినది. పరిశ్రమాభివృద్ధిగల దేశంకన్నా, లిబరల్ ప్రజాస్వామికం వున్న యూరప్‌లో ఉత్తర అమెరికాలో ఆర్థిక అసమానత తక్కువగా వున్నది. బ్రిటిష్ సామ్రాజ్యంలో, యునైటెడ్ స్టేట్సులో జరుగుతున్న పరిస్థితులు గమనిస్తే, ఎక్కువ, తక్కువ రాబడుల మధ్యవున్న తారతమ్యం తగ్గిపోవుచున్నది. ఫ్రాన్సులో ప్రాచీన పరిపాలనకన్నా [illegible], ఈ రిపబ్లిక్కులలో అసమానత క్షీణించినది. అన్ని లిబరల్ ప్రజా

స్వామిక దేశాలలో, ఆస్ట్రేలియా, ఫిన్‌లాండులలో తక్కువ రాబడిని పెంచుటకు, ఎక్కువరాబడిని తగ్గించుటకు ప్రయత్నాలు జరుగుచున్నవి. అసమానతను చాలావరకు తగ్గించారు. లిబరలిజంలేని దేశాలలో ఆర్థిక అసమానత అనేకరకాలుగా వుంటుంది. అందువల్ల అనేకమందిని దోపిడీజేసి కొద్దిమంది బాగుపడుతున్నారు. ఇదే పరిస్థితి సమాన సమిష్టిగా వుండే వారికి, సంఘంగా వుండేవారికి, గుత్త ధనికవాదం గలవారికి వర్తిస్తుంది. స్కాండినేవియన్, ఇంగ్లీషు, ఫ్రెంచి జాతులలో కార్మికులు నశించిపోతున్నారు. (కొన్ని దేశాలలో నశించి పోయినారు) మెడిటెరేనియన్ ఏషియాటిక్, తూర్పు ఐరోపా, లాటిన్ అమెరికాలలో కార్మిక నిస్థాయి పెరుగుతున్నది. ప్రజాస్వామ్యాన్ని ఎదుర్కొనే సమస్యలన్నింటిని లిబరల్ ప్రజాస్వామికం హేతువాద దృష్టితో పరిష్కరిస్తుంది.

కొంతకాలం స్వేచ్ఛా సమాజాలను అనుభవించిన కొన్ని జాతులకు ఆచారత్వం తక్కువస్థాయిలో వున్నది. లిబరల్ విలువలు, ఆశయాలు బాహుళ్యంగా వున్నచోట వర్గ తారతమ్యాలు తక్కువగా వున్నాయి. సంప్రదాయాధికారం ఎక్కడైతే ప్రబలంగా వుంటుందో అక్కడల్లా వర్గభేదాలు పెరుగుతున్నవి. దీనికి దక్షిణ వామపక్షాలతో సంబంధంలేదు. న్యూజీలాండ్, స్వీడన్ దేశాలలో వున్న వర్గాల తారతమ్యాల కన్నా, సోవియటు రష్యా, చైనాలలో కార్మికులు, కర్షకులలో భేదాలు హెచ్చుగావున్నవి. ఈ రెండు దేశాలలో సూపర్ వైజర్లు, మేనేజర్లు, పరిపాలన నిర్వహించేవారు, సామాన్య ప్రజానీకానికి మధ్య అనేక వ్యత్యాసాలు వున్నవి. ఈజిప్టులో,

థాయిలాండ్‌లో పేదవారికి సంపదగలవారికి వున్నట్టి తేడా, కెనడాలోను, స్విట్జర్‌లాండ్‌లోను లేవు.

స్వేచ్ఛ, జాతులలో వున్న పరస్పర స్నేహంవంటిది కాదు. పార్టీ తగాదాలు, ఒక పార్టీకే కట్టుబడి వుండటం, సహోదరత్వం, ప్రేమ, ఏకమత్యత అని ఆలోచించేవారికి భయంకరంగా వుండును. లిబరలిజాన్ని వృద్ధిచెయ్యాలని అనుభవంవల్ల తెలిసికున్నాం. అదే సౌఖ్యానికి, స్వేచ్ఛకు మార్గమని తెలుస్తున్నది. స్వేచ్ఛా సమాజంలో ప్రజానీకం కలుపుగోలుతనంగా పనిచేయుటకు వీలుంటుంది. తొమ్మిది తరాలుగా గ్రేటు బ్రిటన్‌లో వున్న అసందిగ్ధ పరిస్థితిని ఏవిధమైన సాయుధ బలాన్ని ప్రయోగించకుండా పరిష్కారం అయినది. గత శతాబ్దంలో జరిగిన యుద్ధాలు, విప్లవాల ఫలితంగా వచ్చిన గడ్డు సమస్యలను 3, 4 ఫ్రెంచి రిపబ్లిక్కులు పరిష్కరించినవి. స్వేచ్ఛారాష్ట్రాలతోనే ఫెడరేషన్ ఏర్పాటు చేసివున్నట్లయితే అమెరికాలో కల్లోలపరిస్థితి వచ్చివుండేదికాదు.

రష్యాయన్ విప్లవం జరిగి నేటికి 39 సంవత్సరాలు గడిచినా, జైళ్ళలలోను, నిర్బంధ క్యాంపులలోను వేలాదిమంది ప్రజల మ్రగ్గుచున్నారు. యిదంతా అభివృద్ధి, సౌఖ్యమని చెప్పుకొనుట సిగ్గుచేటు. పైగా అక్కడ పాలకులతో ఏకీభవించక పోయినట్లయితే, వాక్కు, సభాస్వాతంత్ర్యాలు వుండవు. చైనాలో కమ్యూనిజం విజయంపొందుటకు 20 వేలమంది ప్రజానీకం ఆహుతిఅయినారు. కమ్యూనిస్టురాజ్యంలో వలె ఫాసిస్టు రాజ్యంలోకూడా అదే పరిస్థితి కాంచవిస్తుంది. కాని సత్వం, అసమానమన్న దేశాలలో విప్లవాలువచ్చును.

అప్పుడు లోపలా బయటావున్న శత్రువులచే నియంతయొక్క నియంతృత్వాన్ని లొంగదీయును. మనకు స్వేచ్ఛ కావాలా? నియంతృత్వం కావాలా? నియంతృత్వంలో ఆలోచనకు మాట్లాడుటకు ఆస్కారం లేదు. కిక్కురుమనకుండా చనిపో వాల్సిందే. యిట్టి పరిస్థితి కావాలని కోరుకుంటారా? "వారి నాలో ఆజ్ఞ పరిపాలిస్తున్నది" అని ఒక రష్యన్ పాలకుడు చెప్పాడు. 1953 జూన్ 17 తరువాత తూర్పుజర్మనీలోను, 1956 జూన్ 28 తరువాత పోజనాన్‌లో "ఆజ్ఞ"యే పరిపాలిస్తున్నది.

స్వేచ్ఛాజాతులలో సమానత్వం వుండదు. యుద్ధం మానవజాతికి ఒక ఉపద్రవం. అనేక వేల సంవత్సరాలనుంచి ఆ విధంగానే వున్నది. శాంతిపేరుతో లిబరల్ ప్రజాస్వామికాన్ని దుయ్యబట్టుతూ, అనేకమంది హిట్లరులను, స్టాలినులను ఉద్ధారకులుగా ఆహ్వానించారు. శాంతిపేరుతో వాక్స్వాతంత్ర్యాన్ని అణిచివేశారు. మొదటి ప్రపంచయుద్ధం, ఆస్ట్రియా, జర్మని, రష్యా దేశాలను పరిపాలిస్తున్న నిరంకుశ ప్రభుత్వాలు తీసికొన్న నిర్ణయాలవల్ల వచ్చినది. రెండవ ప్రపంచసంగ్రామం జర్మని రష్యాలలోని నియంతలు చేసికొన్న అపకీర్తి, ఒప్పందంవల్ల వచ్చినది.

ఈనాడు యుద్ధభయం అనేక వేలమందిమీద కొంత మంది మాత్రమే పెత్తనం చలాయించే దేశాలనుంచే వస్తున్నది. స్వేచ్ఛ, శాంతితో సమానం కాకపోయినను, కనీసం స్వేచ్ఛ ఎక్కడైతే వుంటుందో, అక్కడ శాంతికోసం పనిచేయుటకు వీలుంటుంది. గ్రేటుబ్రిటన్ బోయర్సుతోను, ఐరిష్‌తోను యుద్ధం చేసినప్పుడు, బ్రిటిష్ ప్రజానీకం నిజపరిస్థితులను

ఉత్సాహంతో ప్రచారంచేశారు. ప్రజలకు నమ్మకం కల్గించారు. ఆ ఫలితంగానే బోయర్సు, ఐరిష్ ప్రజలు స్వపరిపాలనాధికారాన్ని, స్వాతంత్ర్యాన్ని సంపాదించారు. "ప్రత్యేకమైనవిధి" కొంతమంది అమెరికన్లను ప్రోత్సహించినప్పుడు, మిగతావారు దానిని ఆటంకపర్చారు యిదంతా కూడా లిబరల్ ప్రజాస్వామిక అమెరికనులవల్ల జరిగింది. ఆ ప్రజాస్వామిక దృష్టివల్లనే కారిబ్బీన్, సెంట్రల్ అమెరికన్ రిపబ్లిక్కులు స్వాతంత్ర్యాన్ని నిలబెట్టుకున్నారు. కాని సోవియటు పరిపాలకులు ఫిన్‌లాండుమీద, పోలాండుమీద దాడిచేయుటకు నిర్ణయించి, బాల్టిక్కు రాజ్యాలు, రుమానియాలమీద దౌర్జన్యం చేసినప్పుడు ఎవ్వరూ ముందుకురాలేదు. అవని తప్పు అని కూడా అనలేదు.

దక్షిణకొరియాలో వున్న కొంతమంది ఉత్తరకొరియా మీద యుద్ధంచెయ్యా లన్నప్పుడు, దక్షిణకొరియాలోని లిబరల్ ప్రజాస్వామికవాదులు దానిని నివారించారు. ఇదంతా స్వేచ్ఛపలన జరిగిందే అయితే అట్టిస్వేచ్ఛ ఉత్తరకొరియా వాసులకు లేనందున 1950 లో యుద్ధంచేశారు. దాని ఫలితంగా ఆదేశస్థులు అనేక బాధలకు లోనైనారు. ఎప్పుడైతే యుద్ధం చేసేవారు లేకపోతారో, అన్ని అధికారాలు ఒకనిక్రింద కేంద్రీకృత మగునో, అప్పుడు మాత్రం నియంతృత్వం యుద్ధాన్ని నివారించగలదు. ఇదేనా శాంతికాముకులు కోరేది? ఏ పక్షమునకు చెందనట్టి ఏషియాటిక్, ఐరోపావారు, వాషింగ్టన్‌లోను, ప్యారిస్‌లోను, శాంతికి భంగంగావుండే విధానాలందు న్యాయంగానే వున్నారని అనుకోవచ్చును. అయితే వారు

వాస్తవాన్ని గ్రహించాలి. రాజకీయ నిర్మాణంలో ప్రజానీకం పాల్గొనే అవకాశమున్నప్పుడు, యుద్ధానికి, బెదిరింపులకు అవకాశ ముండదు. ఏ కొద్దిమంది చేతులలోనే అధికారం కేంద్రీకృతమై వున్నప్పుడు మాత్రమే శాంతికి భంగం వాటిల్లుతుంది.

స్వేచ్ఛ, జాతీయ స్వాతంత్ర్యం రెండు ఒకటికాదు. అయినా గడిచిన రెండువందల సంవత్సరాలలో జరిగిన సంఘటనలు చూస్తే, జాతీయ వుద్యమాలయొక్క ప్రధానాశయం, జాతీయ స్వతంత్ర రాజ్యాలను నిర్మించటం, జాతీయభావాలను ప్రోత్సహించటం, స్వేచ్ఛకు అవకాశమున్నప్పుడే జరుగుతుందని తెలుస్తున్నది. సంపూర్ణాధికారాన్ని, నిరంకుశత్వాన్ని కల్గియున్న ఏజాతీకూడా, స్వాతంత్ర్యాన్ని పొందలేదు. దాని జాతీయతలోను, జాతీయ వాదంలోను, మూఢ విశ్వాసం వున్నవారు, లిబరల్ ప్రజాస్వామికంయొక్క విలువలను, దాని ఫలితాలను, ఆశయాలను ప్రోత్సహించలేరు. పైగా ద్వేషిస్తారు. అట్టివారు స్వాతంత్ర్యాన్ని, స్వేచ్ఛను పొందటం అసంభవం. మనం కొన్ని నిదర్శనాలు చూద్దాం. లిబరలిజం శక్తులు బలంగావున్న స్వతంత్రజాతులలో, పశ్చిమ యిరోపాలో యీ ఆశయం విజయం సాధించినది. మధ్య తూర్పు యిరోపాలో విజయం సాధించలేక ఓడిపోయినది ఎందుకంటే అచ్చట నిరంకుశత్వం, లిబరల్ ప్రజాస్వామికంమీద పెత్తనంవహించి అజమాయిషీ వహించినది. 1821 మరియు 1921 మధ్య నిర్మింపబడిన 20 జాతీయరాజ్యాలు, యూరప్‌లో లిబరల్ ప్రభావం ప్రబలంగా వున్నప్పుడు స్వతంత్రతను సంపాదించినవి. 1921

నుంచి కమ్యూనిజం, సంప్రదాయవాదం ప్రచారంలోనికి వచ్చిన దగ్గరనుంచి, వాటి స్వాతంత్ర్యం నానాటికి దిగజారిపోతున్నది.

ఉత్తర అమెరికాలోని 13 కాలనీలలోని ప్రజానీకం, స్వాతంత్ర్యంకోసం కలహించినవి. సంపూర్ణాధికారం గల్గిన స్పానిష్ పరిపాలనలో యిట్టిదానికి అవకాశం లేదు. అందుకనే 1808 లో ఒక విదేశీప్రభుత్వం స్పెయినుమీద దాడిచేసి, స్పానిష్ ప్రభుత్వాన్ని భిన్నాభిన్నం చేసింది. అప్పుడు స్వాతంత్ర్యాన్ని బలవత్తరశక్తిగా గ్రహించింది. నిరంకుశ అధికారం కల్గిన ఓట్టమాన్ రాజ్యంలో, అరబ్బులు శాంతిప్రియులు, యూరోపియన్ ప్రజాస్వామిక వాదులు, సుల్తాన్ క్యాపిటలిస్టులను తొలగించినప్పుడు, జాతీయవాదం ప్రత్యక్షమయింది. అరబ్బీభాష మాట్లాడే పదిజాతులకు స్వాతంత్ర్యానికి మార్గం చూపింది. 1840 మరియు 1939 సం॥ల మధ్య జరిగిన అనేక శాసన సమ్మతమైన నిబంధనలను చూస్తే, లిబరలిజమే ప్రధాన శక్తిగా వున్నది. ఆ శక్తివల్లనే బ్రిటిష్ సామ్రాజ్యాన్ని 9 స్వేచ్ఛారాజ్యాలుగా మార్చినది. తరువాత యిరిషులుకూడా కామన్వెల్తులో చేరారు. రిపబ్లికనులు, ప్రజాస్వామికవాదులు, లిబరలిజంవల్లనే, ఫిలిప్పైన్సు పోర్టోరికో దాస్యం లేకుండా స్వాతంత్ర్యాన్ని సంపాదించినవి. లిబరలిజాన్ని ఆధారంగా చేసికొని, జాతీయవాదం, సామ్యవాదం అమలులోనికి వచ్చినవి. ఎక్కడైతే నియంతృత్వం అధికారంలో వున్నదో, అచ్చట జాతీయంగా గాని, సాంఘికంగాగాని స్వేచ్ఛలేదు. జాతీయవాదం, సోషలిజం పనిచెయ్యవు.

సామ్రాజ్యవాదంయొక్క అంచును లిబరలిజం తీసుకు

న్నది. అన్నిరంగాలలోను మానవప్రయత్నాలను వృద్ధిజేసింది. ఉత్తర అట్లాంటిక్ జాతులలో లిబరలు విప్లవాలకు దారి చూపింది. కలోనియల్ దోపిడికి బదులుగా ట్రస్టీషిప్పును ఏర్పాటుచేసినది. దానిఫలితంగా షుమారు20 ఏషియన్ ఆఫ్రికన్ జాతులు స్వాతంత్ర్యాన్ని పొందారు. సామ్రాజ్యవాదాన్ని, వలసతత్వాన్ని రూపుమాపే లిబరలుశక్తులుగనుక గ్రేటుబ్రిటను, అమెరికా సంయుక్తరాష్ట్రాలు, ఫ్రాన్సు,హాలండ్ లలో లేకపోయినట్లయితే, ఇండోనేషియాలో గాంధి, నెహ్రూలు, ఫిలిప్పయిన్సులో క్విజాన్, ఒస్ మేలానా, జావాలో సుకర్నో, టునీషియాలో జెడ్ గై బౌలాంటివాళ్ళు పేరుకువచ్చివుండేవాళ్ళు కారు. అదిగాకపోయినా గ్రేటుబ్రిటన్, అమెరికా, హాలండ్, ఫ్రాన్సు దేశాలు, కొరియాలో జపానువారు అవలంబించిన క్రూరవిధానాలు, రష్యనులు మధ్యఆసియాలోను, కాన్ కాన్ లోను ప్రవేశపెట్టిన హింసాకాండను అనుసరించినట్లయితే, పైవిధంగా జరిగివుండేది కాదు.

ఈరోజు వలసవిధానం పోవాలని గందరగోళం చేస్తున్నారు. కాలనీలకు స్వస్తిజెప్పి, స్వతంత్రరాజ్యాలుగా ఏర్పాటు చేయుటకు లిబరల్సు ప్రయత్నంచేస్తున్నారు. అయితే వలస విధానంకు సాధారణమైన తిరుగుబాటు వున్నదనుకోటం పొరబాటు. లిబరలు ప్రజాస్వామికవాదం ప్రాబల్యంవహించినచోట వలసవిధానానికి ఒకవిధమైన తిరుగుబాటు వున్నది. నిరంకుశత్వం అధికారంగా వున్నచోట తిరుగుబాటుకు అవకాశమే లేదు. 1940లో పశ్చిమ పరిపాలనక్రింద, జావనీస్, మలయావారున్నారు. జపాను పరిపాలనక్రింద కొరియనులు, ఫైవనీస్,

మంచూరియన్సు వున్నారు; ఇండొనీషియాలో స్వాతంత్ర్య వుద్యమం బలవత్తరంగా వున్నది. కొరియా, మంచూరియా, తైవాన్‌లలో అట్టి వుద్యమం లేదు. సోవియట్ యూనియన్, బ్రిటిష్, ఫ్రాన్సు దేశాలను గమనిస్తే భేదాలు తెలుస్తాయి. అల్జీరియనులు, సైప్రియట్సు వివాదంలో వున్నారు యూక్రేనియన్సు, జార్జియన్సు, ఉజబెక్కులతో తిరుగుబాటు లేదు.

జనాభాగాను, వైజ్ఞానికంగానూ చూస్తే, కాథలిక్కు ఐరిష్ ప్రజలు బ్రిటిష్‌వారికి ఎలాగో, చైనావారికి చూయాంగ్సు ముస్లింలీగన్సు అలా వుంటారు. అయితే ఐరిష్‌వారు ఎదురు తిరిగారు. చూయాంగ్సు లిగన్సు హాయిగా కూర్చున్నారు. డచ్చి, ఫ్రెంచి బ్రిటిష్ వలస దేశాలలో నిరంకుశత్వం ప్రాబల్యంగా వున్నది. హాలండ్, ఫ్రాన్సు గ్రేటుబ్రిటనులో స్వేచ్ఛా సమాజాలు వున్నందువలన నిర్బంధానికి తావులేదు. జాతీయ భావాన్ని పెంపొందించుటకు వీలుగా, వాక్స్వాతంత్ర్యాలు ఇండొనీషియనులకు, అల్జీరియన్సుకు, ఐరిష్‌వారికి వున్నది.

సోవియట్ యూనియన్‌లో చైనాలోనువున్న జాతీయ మైనారిటీవర్గాలలో స్వతంత్రవుద్యమాలకు తావేలేదు. రష్యా, చైనా, 1945కు పూర్వపు జపానుప్రభుత్వాల నిరంకుశధోరణి వల్ల స్వేచ్ఛకు అవకాశంలేకుండా పోయింది. (మొదటి ప్రపంచ యుద్ధానంతరంలో యూక్రేనియనులు, జార్జియనులు, ఉజబెక్కులు, మంగోల్సు, టిబిటియన్స్ వచ్చిన అవకాశాన్ని పురస్కరించుకొని స్వాతంత్ర్యాన్ని పొంది, తిరిగి రష్యనులు చైనావారు వారి పరిపాలనను సుస్థిరంగా ఏర్పాటుచేసుకుండే టంతవరకు నిలబెట్టుకున్నారు. రెండవ ప్రపంచయుద్ధానంతరం

అవకాశంవచ్చినప్పుడు కొరియనులు, డైవనీసు, మంచూరియ నులు జపాను పరిపాలనను తిరస్కరించారు) పూర్వపు వలస రాజ్యాలలో వున్న జాతీయవాదులు, లిబరలు ప్రజాస్వామి కాన్ని ద్వేషించకుండా, కమ్యూనిస్టు రాజ్యాలలో దినదినాభి వృద్ధి చెందుతున్న వలసవిధానాన్ని గమనించాలి. లేకపోతే వాళ్ళనుకూడా మ్రింగివేస్తుంది. ప్రతిజాతికి స్వతంత్ర హక్కు వున్నది. మానవజాతిని అభివృద్ధి పర్చుటకు అవకాశమున్నది. ఆ హక్కును కాపాడేది జాతీయవాదం కాదని, లిబరలిజం ఒక్కటేనని గ్రహించాలి.

స్వేచ్ఛ పెద్దపెద్ద వర్గాలలోవున్న స్వపరిపాలనాధికారం లాంటిది కాదు. అయితే లిబరలు వర్గాలలో, మతసంప్రదాయాలు, ప్రత్యేకశ్రద్ధగల సంస్థలు, స్థానికముఠాలు, వారి జీవితాన్ని వారు గడుపుకుంటూ, ఆశయాలకోసం పనిచేయుటకు వీలుగా వుంటుంది. పశ్చిమ ఐరోపాలోను, ఉత్తర అమెరికా లోను వున్న స్వేచ్ఛాజాతులలో, మధ్యతరగతి ప్రజలు, కాథలిక్కులు, జ్యూలు, యజమానులు, కర్షకులు, కార్మికులు, కళాకారులు, ఫ్యాక్టరీలలో పనిచేసే కూలీలు, ఆఫీసులలో పని చేసే ఉద్యోగస్తులు, చిన్నాపెద్దా అనే తారతమ్యం లేకుండా వారి అభిరుచులప్రకారం పనిచేయుటకు, ఆశయాలకు అభిలాష లకు భంగంరాకుండా పనిచేయుటకు హక్కువుంటుంది. కాని నత్వంలో కృశించే రాజ్యంలో డొమినియన్ రిపబ్లిక్కులలో పైవర్గాలవారి నందరిని పాలకుల ఆజ్ఞలను శిరసావహించేలాగున చేస్తారు. బాధ్యతలేనటువంటి కేంద్రీకృత అధికారంతో లొంగ దీస్తారు. ఎక్కడైతే స్వపరిపాలనాధికారం వుండదో అక్కడ

బాధ్యతకూడా వుండదు. వ్యక్తిస్వామ్యం లేకపోతే జీవితం వికసించదు. మార్పులేకుండా నిలకడగా వుంటుంది. పాలకుల గొప్పతనమే, ప్రజల గొప్పతనంగా ఘనతగా భావిస్తారు.

**Pax romana or pax sinica** అంటే కేంద్రీకృతమైన నిరంకుశత్వాన్ని స్థాపించటం. ఆ అధికారంతో స్వతంత్ర స్వేచ్ఛా వుద్యమాలను అణగద్రొక్కుతారు. ప్రజానీకాన్ని నిర్జీవ ప్రతిమలుగా జేసి, పాలకులకు దాసోహం చేస్తారు. **Pax humana** అంటే, పరస్పర సహకారంతో ఏర్పడే స్వతంత్ర జాతులు. లిబరలు ప్రజాస్వామికం ఆధారంగా ఏర్పడేది. ఇది మరచిపోయినవారు తిరిగి గుర్తుకు తెచ్చుకోవాలి. లిబరలు ప్రజాస్వామిక దేశాలవల్లనే **Pax Humana** ను స్థాపించుటకు అవకాశముంటుంది. అంతర్జాతీయసమితి స్థాపనకు ఒక పెద్ద అమెరికన్ లిబరలు మూలకారణం. అదేవిధంగా ఐక్యరాజ్యసమితికి కారణంకూడా. ఒక పెద్ద శక్తికల అమెరికన్ లిబరల్

నిరంకుశత్వాన్ని లిబరల్ ప్రజాస్వామికరాజ్యాలు అదుపులో వుంచినంతవరకు, నానారాజ్యసమితి పనిచేసింది. కమ్యూనిజంలో మూఢవిశ్వాసంగల జాతీయవాదులు ఫాసిస్టు అధికారులతో చేతులు కలిపినప్పుడు మాత్రమే సమితి కూలిపోయింది. లిబరల్ ప్రజాస్వామిక దేశాలు బలంగా వున్నంతవరకు ఐక్యరాజ్యసమితి పనిచేస్తుంది. సామ్రాజ్యతత్వాన్ని, యుద్ధాన్ని తొలగించి **Pax humana** స్థాపించుటకు యింకా చాలా కాలం పట్టుతుంది. ఈరోజు ముఖ్యమైన ప్రతిబంధకం నిరంకుశత్వంతో కూడుకున్న అధికారంగల రాజ్యాలు ఐక్యరాజ్యసమితి విజయం పొందాలంటే, అన్ని దేశాలలోవున్న

లిబరల్ను సామర్ధ్యంమీద ఆధారపడివున్నది. నియంతలను తొలగించి లిబరల్ ప్రజాస్వామికాన్ని ఏర్పర్చినప్పుడు స్వేచ్ఛ సాధ్యపడుతుంది.

స్వేచ్ఛ అంటే సంపద అనికాదు. అయితే స్వేచ్ఛగా వున్న గ్రీకుసిటీస్టేట్సుకూడా సంపదతో తులతూగినవి, స్వేచ్ఛా సంపదలు ఒకసారి సంభవించిన తరువాత మాత్రం కాదు. బానిసజాతులలో కూడా నియంతృత్వం సడలింపబడినప్పుడు తరుచుగా ఆర్థికవిధానం విస్తరింపబడును. ఈస్థితి మొదటి రెండు రోమనుయాన్‌టోనిన్, చైనీన్‌సంగ్, టర్కీసలీం మూడవ వాడు, రెండో రష్యన్ అలెగ్జాండరు కాలాలోవున్నవి. ఫ్రెంచి, రష్యాయన్ విప్లవాలలో, వారిదేశాలు కటికదరిద్రం నుంచి బయటపడుటకు, కంట్రోల్సును తాత్కాలికంగా తొలగించి, కఠినినిర్బంధాలను మితంగావుంచుట మంచిదని రష్యయనులు ఫ్రెంచివారు గ్రహించారు. గడిచిన పదిశతాబ్దములలో సంపదయొక్క ప్రధానభాగం పశ్చిమాన్నుండి, మెడిటిరేనియన్ రిపబ్లిక్కులనుండి, టస్కనులొంబార్డు ఫెల్‌మిష్ పట్టణాలకు వెళ్ళినది. తరువాత హాలండ్‌నుంచి గ్రేట్‌బ్రిటనుకు, ఉత్తరఅమెరికాకు, సంపద స్వేచ్ఛామార్గాన్ని అనుసరించి నల్లుగా వెళ్ళినది.

శాస్త్రపరిశోధనలు సాంకేతిక అభివృద్ధి, ఉత్పత్తిలో నవీన పద్ధతులు ప్రవేశపెట్టుట ముఖ్యంగా గ్రేటుబిటనులో ప్రారంభించబడినవి. దీనితరువాత నియంతృత్వంనుంచి బయటపడి ఫ్రాన్సు అనుసరించింది. తరువాత అమెరికా అనుకరించింది. 18౫౦ నుండి 19౩౩ వరకు వున్న స్వేచ్ఛతో కొద్దికాలంలో

జర్మనీ అనేక నూతన విషయాలు కనుగొన్నది, రష్యాసంగతి చూస్తే, జారుప్రభుత్వంక్రిందగాని, యితర నాయకుల క్రింద గాని కొత్తవిషయాలు కనిపెట్టలేదు. స్వతంత్రంగా వున్న జాతులు కనిపెట్టిన విషయాలను అనుసరించి అనుకరణ మాత్రం చేసినది. పెద్దపెద్ద ఘనకార్యాలు ప్రాచీనకాలంలో, నవీన కాలంలో జరిగినట్లు పేర్లు వింటాం. మనం ఒక సంగతి ఆలోచించాలి. ఒకటి రెండు తరాలు చూస్తే, స్వతంత్ర జాతులలో ఆర్థికవిధానం పెంపొందినట్లుగా తెలుస్తుంది. ఇది బానిసత్వంవున్న చోట్ల జరగదు. స్వేచ్ఛవుండాలంటే, సంపద అవసరమని చాలామంది నమ్మకం. ఇది భ్రాంతి. స్వేచ్ఛకు వాంఛ వుండాలి. సంపదతో నిమిత్తంలేదు. అయితే స్వేచ్ఛా వాతావరణం వస్తే, సంపదకూడా దానిని అనుసరిస్తుంది.

స్వేచ్ఛ అంటే నిర్భయం అనికాదు. "మేము రక్షణ యిస్తాం" అంటూ సీజరునుంచి మానోవరకు ట్రంజిల్లో చెప్పారు. దీనిని ప్రజానీకం గుడ్డిగా నమ్మారు. అనుసరించారు. 4 వేల మిలియన్ల ఇటాలియన్లు యుద్ధ భయోన్మాదంలో 1924 లో ముస్సోలినీకి అధికారం అప్పగించారు. ఆ నియంత యుద్ధం లోనికి దించినప్పుడు సిసిలీనుంచి ఆల్ప్సువరకు పీనుగులపెంటగా మారినప్పుడు, శిథిలావస్థ సంభవించినప్పుడు, నియంతయొక్క రక్షణ ఏమిటో అర్థం చేసుకున్నారు. దేశం యుద్ధరంగంగా మారినప్పుడు నియంతయొక్క రక్షణను గ్రహించారు. 1932, 1933 సంIIలో జర్మనులు హిట్లరుకు అధికారాన్ని హస్తగతం

చేసినప్పుడు, లక్షలాది ప్రజానీకం స్టాలిన్ గ్రాడు, పిరసీన్ మధ్య చనిపోయినప్పుడు, బాంబులవర్షం కురిపించినప్పుడు మిగిలిన వారు నియంతయొక్క రక్షణ అభయాలలోని యదార్థాన్ని గ్రహించారు.

బుద్ధికుశలతగల అనేకమంది అమెరికనులు, 10 మిలియన్ల నిరుద్యోగస్థులు యంప్లాయిమెంటు యక్సేంజిచుట్టూ తిరుగుతున్నప్పుడు, రష్యాలో ఏమి జరిగినదో చూచుటకు దృష్టిమరల్చారు. అచ్చట ఘోరంగావున్నది. సోవియట్ యూనియన్‌కన్నా యునైటెడ్ స్టేట్సులో భయ విభ్రాంతులు హెచ్చుగా వున్నవా? ఆ సంవత్సరాలలోనే సోవియట్ యూనియన్‌లో 5 వేల మిలియన్ల రైతాంగాన్ని నిర్దయతో హత్యచేశారు. ఆస్తిపాస్తులను, ఇళ్ళువాకిళ్ళను దోచుకున్నారు. అనేక వర్గాలకుచెందిన వందలు వేలాది ప్రజానీకం నామ రూపాలు లేకుండా పోయినారు. ఇదంతా పాలకుల భయంవల్ల జరిగింది. సోవియట్ రష్యాలో యింకేరక్షణవున్నది? అచ్చట వుండే రక్షణను సర్కసులోవుండే అడవిమృగంతో పోల్చవచ్చును. సర్కసులో మృగం చక్కగా ఆడితే బహుమతి తెచ్చుకుంటుంది, లేకపోతే దెబ్బలు తింటుంది. అదీగాక ఆ మృగంవల్ల ఉపయోగం లేదనుకుంటే, యజమాని దానిని సంహరిస్తాడు. చైనాలోవున్న భద్రతచూస్తే, అధికారవార్తల ప్రకారం 6 నెలలలో 8 లక్షలమందిని కారాగృహానికి పంపారు. వారు చేసిన తప్పుచూస్తే, పాలకులకు వ్యతిరేకమైన అభిప్రాయాలను వెల్లడించారు.

భద్రత, స్వేచ్ఛ విరుద్ధం అనటం దురదృష్టం. ఇది ప్రజలదృష్టిని ఆకర్షించినవి. గతంలో మార్క్సియను, బుకానియన్ ఫేబియన్ సోషలిస్టులు, లిబరలిజానికి వ్యతిరేకంగా పనిచేశారు; ద్వేషించారు. ఒకనాటి లిబరలిజం బలహీనపడితే, సోషలిజం పోయిందనుకున్నారు. భద్రత అంటే నియంతృత్వాధికారం ఉపయోగపడకుండా పూచీనివ్వటం – దానికి పూచీ యివ్వటమంటే స్వేచ్ఛ, స్వతంత్రసమాజాలు మానవుని హక్కులను గుర్తించటం. స్వేచ్ఛ లేదంటే పూచీలులేవు. భద్రతవుండదు. ఇది సామాన్యంగా స్పష్టంగావున్నది. లిబరల్ వ్యతిరేకులు అపాయంగా వర్ణించారు. పూర్తిరక్షణ యివ్వాలని వ్యతిరేకించారు. ఒకచావు మాత్రమే పూర్తిరక్షణ యిస్తుంది. మనకు సాపేక్షమైనరక్షణ యిచ్చేది, ఒక్క లిబరల్ ప్రజాస్వామికం. నియంతృత్వం యివ్వలేదు.

స్వేచ్ఛ, అభివృద్ధి రెండూ సమానంకాదు. కాని స్వేచ్ఛ యొక్క ఫలితమే అభివృద్ధి, స్వేచ్ఛవున్న ప్రజలకే స్వతంత్ర మనోవికాసముంటుంది. అందువల్ల నూతన విషయాలు కనిపెట్టుతారు. శాసిసత్వసమాజాలలో పుట్టిన విత్తనాన్నుండి ఉత్పత్తిఅయ్యే కాయలనే, అగస్టస్, నెపోలియన్, స్టాలిన్ వంటి నియంతలు స్వీకరిస్తారు. అభివృద్ధి చెందాలంటే నియంతృత్వమైన అధికారం వుండాలని చెబుతారు. ఒకరకమైన స్వేచ్ఛవున్న కాలంలో ఉద్భవించిన నియంతలు కొంత అభివృద్ధిని సాధించారని తెలుస్తున్నది. కాని వారి వారసుల

కాలంలో మాత్రంకాదు. నియంతృత్వం పాలకులను, పాలించబడే వారిని యిద్దరిని బానిసత్వంలో ముంచుతుంది. బైజంటైన్ చైనా ప్రభువులు, మధ్యయుగాల పోపులు, కాలిఫ్‌లు వారి యొక్క అధికారాన్ని కట్టుబాట్లను, నిబంధనలు, కర్మకాండల వల్ల అజమాయిషీ వహించారు. తరువాత తగ్గిపోయినారు. వాళ్ళు ప్రచారంచేసికొనుటకు అభ్యంతరంలేదు. బయటనుంచి వత్తిడివస్తేనేగాని వాళ్ళలో మార్పురాదు. మార్పులేకపోతే అభివృద్ధి వుండదు.

*

# 8

## కమ్యూనిస్టు స్వేచ్ఛను వ్యతిరేకించును

లిబరల్ ప్రజాస్వామికం ప్రోత్సహించే వారిలో రెండు రకాలవారు వున్నారు. ఒక తరగతికి చెందినవారు లిబరలిజం ఉత్సాహాన్ని అంగీకరిస్తూ, స్వేచ్ఛాసమాజాలను చాలావరకు ఒప్పుకుంటారు. వీరు ఒకవిధంగా లిబరలిజాన్ని వ్యతిరేకిస్తారు. రెండవతరగతికి చెందినవారు లిబరలిజాన్ని ఆచరణలో,ఊహలో పూర్తిగా వ్యతిరేకిస్తారు. ఈ రెండుతరగతులవారికి తేడా నిర్ణయించాలి. మొదటితరగతికి చెందినవారు ప్రాచీన ఆచరణలకు చెందినవారు. సాంఘిక ప్రజాస్వామికాన్ని అవలంబించేవారు. ఇంగ్లీషు మాట్లాడే జాతులలో (మార్పుకు ఇష్టంలేనివారు) పూర్వాచారపరాయణులు సంప్రదాయ లిబరలిజాన్నే అనుసరించారు. ఈ తరగతిలో చేరినవారంతా మార్పులకు వ్యతిరేకులు, స్వేచ్ఛాఫలితాన్ని జూచి భయపడేవారు. స్వేచ్ఛాసమాజాలు స్వతంత్రంగా వుండుటకు సమానత్వంవుండాలని చెప్పేవారికి వ్యతిరేకులు, మాజీ లిబరల్సు వుంటారు. యునైటెడ్ స్టేట్సులో జాతిసమానత్వాన్ని అంగీకరించని దక్షిణ ప్రజాస్వామిక వాదులు, పూర్వసంప్రదాయానికి చెందినవారు. ఐరిష్ పాలనను వ్యతిరేకించిన బ్రిటిష్ లిబరల్సుకూడా ఈ వర్గా

నికి చెందినవారే. కాథలిక్కు సమానత్వాన్ని జూచి భయపడి డచ్చి కాల్వనిస్టులుకూడా మితవాదులుగా మారిపోయారు. అదేవిధంగా స్వతంత్రంగా ఆలోచించేవారినిజూచి భయపడిన బెల్జియన్ కాథలిక్కులు, ఫ్రెంచివారుకూడా మితవాదులుగా మారిపోయినారు.

లిబరల్ జాతులలో ఈకాన్సర్వేటివులు స్వేచ్ఛకు ప్రతిబంధకంగా వుంటారు. కాని అంత ప్రమాదకరమైనవారు మాత్రం కాదు. లిబరలిజంయొక్క రాజకీయకార్యక్రమాన్ని అంగీకరించినప్పుడు, సాంఘిక, ప్రజాస్వామ్యవాదుల, సోషలిజం యొక్క ప్రధానఅంశంనుంచి తొలగిపోతారు. 50 సంవత్సరాల క్రితం లిబరల్సుకు, సాంఘిక ప్రజాస్వామికవాదులకు ఎంతో తేడా వుండేది. ఈరోజు చాలా తక్కువగా వున్నది. (ఒకతరంలో ఆ వ్యత్యాసం పూర్తిగా పోవచ్చును) ఆర్థిక, సాంఘికచట్టాల యొక్క అవసరాన్ని లిబరల్సుగుర్తించారు. సొంతఆస్తిహక్కు వుండకూడదని, ఆస్తి యంతయు ప్రభుత్వఆధాయంలో వుండాలనిచెప్పే సాంఘిక ప్రజాస్వామికవాదులు, ఆ భావాలకు తిలోదకా లర్పించారు.

యునైటెడ్‌స్టేట్సు, కెనడా మొదలగు దేశాలలో సాంఘిక ప్రజాస్వామికాన్ని, మార్పుతెచ్చే లిబరలిజం కలిపి వేసుకున్నది. (సోషలిజాన్ని ముందుకు పోకుండా ఆటంకపర్చింది.) గ్రేటుబ్రిటన్ ఆస్ట్రేలియా స్కాండ్‌నేవియన్ మొదలగు దేశాలలో లేబరిజంయొక్క మూలమైన సోషలిజాన్ని ముక్కలు ముక్కలుగా చేస్తున్నది. కాంటినెంటల్ ఏషి

యూటిక్ ప్రజాస్వామికాలలో లిబరల్సుకు. సాంఘిక ప్రజాస్వామిక వాదులకు పరస్పరసహకారం పెరుగుతున్నది. ఇటలీ నుంచి ఇండోనీషియావరకు నేడు సోషల్ ప్రజాస్వామిక పార్టీలు లిబరలిజాన్ని ఉదాత్తంగా ప్రోత్సహిస్తున్నాయి.

ప్రాచీన సంప్రదాయవాదులు జాతీయవాదులు, కమ్యూనిస్టులు, లిబరలిజాన్ని వ్యతిరేకిస్తారు. ప్రాచీన సంప్రదాయంలో గల అధికారాన్నిగూర్చి ఎవ్వరూ అనుమానపడ నవసరంలేదు. ఈ మూఢ నమ్మకస్తులు అధికారంలోవుంటే ఏమి జరుగుతుందో, పేటియాన్, మాసాకేన్ వీళ్లు స్పష్టంగా తెలుపుతున్నవి. లాటిన్ అమెరికాలో యూరోపియన్ ప్రాక్పశ్చిమ దేశాలలో ఏమి జరుగుతున్నదో గమనిస్తే సరిపోతుంది లేకపోతే ఇటీవలజరిగిన సంగతి గమనించినా సరిపోతుంది. సంప్రదాయవాదులు సత్యంకోసం అనుసరించే విధానానికి అంతూ పొంతూ వుండదు, స్వేచ్ఛకు ఈ విధానానికి పొసగదు. అన్ని దేశాలలోను జాతీయవాదంవల్ల సంభవించిన యుద్ధాలు, తగాదాలు, క్రూరకృత్యాలు, హింసాకాండ, వేలాది లక్షలాది ప్రజానీకాన్ని గొంతుకలుకోయటం, ఉరిశిక్షలు విధించటం, కారాగృహాలకు పంపటం, మొదలగు విషయాలన్నీ యిటీవలనే జరిగినవి. ఇంకా అది మనోఫలకంనుండి పోలేదు. కనుక జాతీయవాదానికి, స్వేచ్ఛకు పొత్తుకుదరదని తెలుస్తుంది. కమ్యూనిజంతో పోల్చినప్పుడే గందరగోళంగా వుంటుంది. 1956 లో జరిగిన సంఘటనలు, సోవియట్ రష్యా 20 వ పార్టీ కాంగ్రెసు, స్టాలిన్ చెప్పినపనులను విధులను తారుమారు చేసినవి. పరిస్థితిని అయోమయంలో పెట్టినవి. స్టాలిన్ను,

కృశ్చేవ్‌కు, బుల్గానియన్ - ఝకోవ్‌లకు మధ్యవున్న తేడా ఏదైనప్పటికి వారంతా ఎప్పుడూ పాలకులే. మంచి చెడు అనే వ్యత్యాసం వుండదు. అధికారమే ప్రధానంగా వుంటుంది. ఈ సంగతులను చాలామంది మరచిపోతారు. నీరోను తొలగించి వెస్‌పాన్‌నియస్, పాసులేమానుని తొలగించి పాహుస్సేను వచ్చినప్పుడు స్వేచ్ఛ, నియంతృత్వాన్ని తొలగించలేక పోయింది.

కమ్యూనిస్టు అధికారంలో వున్నచోట, స్వేచ్ఛవుంటుందని అధికారపూర్వకంగా చెబుతారు. ఈవిషయం యదార్థానికి పూర్తి వ్యతిరేకంగనుక దీన్నిగురించి ఆలోచించవలసిన అగత్యంలేదు. వాక్కు సభాస్వాతంత్ర్యాలు ఎక్కడా వుండవు. పౌరులకు స్వేచ్ఛ వుండదు. అధికారులకు చెప్పుకొనుటకు వీలుండదు. చర్చలకు తావులేదు. తమలోతాము మాట్లాడుకోవాలి. బహిరంగంగా మాట్లాడుకొనుటకు వీల్లేదు. కొద్దిమంది నిరంకుశవాదులు అధికారాన్ని చలాయిస్తారు. స్టేటునే గాకుండా, ఆర్థిక సాంఘిక విధానాలను విద్యను అజమాయిషీలో వుంచుతారు. మత, వైజ్ఞానిక, విశ్రాంతి పనుల విధానమును ఒక పద్ధతిలో వుంచుతారు. ఇదంతా ప్రజలకోసమే చేస్తున్నామని చెబుతారు. స్వేచ్ఛగా ఎన్నికలు అంటూ వుండవు. ప్రజల సౌఖ్య సంపదలకోసం కృషిచేస్తున్నామని కమ్యూనిస్టులు చెబుతారు. స్వేచ్ఛ అంటే సౌఖ్యం అనికాదు.

కమ్యూనిస్టులు పాలించే దేశాలలో స్వేచ్ఛవుండదని రహస్యంగా కమ్యూనిస్టులు అంగీకరిస్తారు. లోపలా బయటా వున్న కమ్యూనిస్టు వ్యతిరేకశక్తులను రద్దుపరుస్తే, స్వేచ్ఛ

ప్రవేశపెట్టవచ్చుననికూడా చెబుతారు. అనేకమంది కమ్యూనిస్టులకు నమ్మకంకూడా వున్నది. ముఖ్యంగా తెలుసుకోవలసింది ఒకపరిమితిగల విధానంలో, లోపలవున్న కమ్యూనిస్టు నిర్మాణాన్ని మార్చుటకు, కమ్యూనిస్టు మార్పుచేయగలరా? గొప్పగనుతో అధికారాన్ని కట్టివేసిన కమ్యూనిస్టురాజ్యం అన్ని కమ్యూనిస్టురాజ్యాలను పోలీసురాజ్యంగా మారుస్తుంది.

కమ్యూనిస్టు విజ్ఞానవేత్తలు కమ్యూనిస్టు తాత్వికులు, కాపిటలిజం, సామ్రాజ్యతత్వవిధానాల ఫలితంగా, అధికార తత్వం ప్రబలిందని తరుచు చెబుతూవుంటారు. కమ్యూనిస్టు శక్తులను బలపర్చుకొని, వ్యతిరేకశక్తులను బలహీనపర్చి, స్వేచ్ఛను ప్రవేశపెట్టవచ్చునని అనుకుంటారు. స్వేచ్ఛ అంటూ వుండదంటారు. అప్పుడు మార్పుల్ని ఊహించినంత సులభం అని అనుకుంటారు. ఆలోచనలలో, ఊహలలో అనేకం సాధ్యం గానే వుంటాయి. ఈ కమ్యూనిజం ఆశావాదం భ్రాంతిమీద ఆధారపడినది. ప్రధానసూత్రాలకు పూర్తిగా విరుద్ధమైనది, అందులో ముఖ్యంగా (ఎ) సమిష్టిసముదాయంయొక్క స్వభావము, (బి) కమ్యూనిస్టు సిద్ధాంతం, (సి) కమ్యూనిజంవల్ల ఏర్పడిన రాజకీయ సమాజాల ప్రాబల్యం.

ఆర్థికవ్యవస్థను సక్రమంగా నడిపించాలంటే, క్రమశిక్షణ అధికారం అవసరమని అనుభవం చెబుతున్నది. కాపిటలిజంలో వందలు, వేలు, లక్షలు, మిలియనులు వ్యక్తులుగల వ్యాపారాలుంటాయి. ఇన్నిరకాలుగా వుండుటవలన పరిశ్ర

మలు, వ్యవసాయం, వర్తకవాణిజ్యం స్వతంత్రంగా వుంటాయి. ఉద్యోగులు, ఉద్యోగా లిచ్చేవారు, యజమానులు, పని వాండ్రు విడివిడిగా వుంటారు. అధికారం వికేంద్రీకరణంగా వుంటుంది. అందువల్ల స్వేచ్ఛాసమాజాలకు తావు వుంటుంది. అధికారం, క్రమశిక్షణ ఒక్క పరిమితిలో వుండును.

సమిష్టిసమాజంలో ఆర్థికవిధానమంతా ఒకే కార్య కేంద్రం క్రింద వుంటుంది. అధికారం, కట్టుబాట్లు క్రమశిక్షణ చాలా కఠినంగా వుండును. చేసిన పథకాలను మార్పుచేయు టకు అవకాశ ముండదు. క్రొత్తనిర్ణయాలను చేయుటకు, ఆర్థిక విధానాన్ని మార్చుటకు వీలుండదు అట్టి పరిస్థితులలో ఆర్థిక విధానానికి స్వేచ్ఛ ఎక్కడిది? ఆర్థికవిధానం, స్టేటు ఒకటిగానే ఉన్నప్పుడు రాజకీయంగా, ఆర్థికంగా స్వేచ్ఛ ఎక్కడిది?

సమిష్టిగావున్న రాజ్యం, రాజకీయంగా స్వేచ్ఛవుంటే, అస్థిమితం, వ్యతిరేకత, జాప్యము—ఇవి తరుచు ప్రజాస్వామిక పద్ధతికి అనుకూలంగావున్నా, ఆర్థికవిధానం సంచలనంలేకుండా నిల్చిపోతుంది. ఆర్థికవిధానంయొక్క సామర్థ్యాన్ని పోషించాలంటే, రష్యా, చైనా, ఆల్బేనియానుంచి ఉత్తర వియత్‌నామ్ వరకువున్న ప్రజాస్వామికంగల దేశాలలో ప్రజాస్వామికపద్ధతిని రద్దుచేసినవిధంగా చెయ్యాలి.

నాగరికత ప్రారంభంనుంచీ అనేక సమిష్టిసంఘాలు వున్నవి. అయితే వాటిలో ఏ ఒక్కటి కూడా స్వేచ్ఛను అను భవించలేదు. దాని రాజకీయరీతులు ఎలావున్నా, వ్యక్తిత్వం

యొక్క స్వేచ్ఛను, సమిష్టిసముదాయం పనికిరాదు. సమిష్టి విధానంలో సొంతసంపద అంటూ వుండదు. వ్యక్తి ఏదిచేయాల్సి లని కోరుకున్నా స్టేటుఅధికారం క్రిందనే చెయ్యాలి. అంటే వ్యక్తికి స్వేచ్ఛ శూన్యం. స్టేటు న్యాయప్రింటుకాగితం సప్లయి చేస్తేనేగాని, పత్రికలు అచ్చువేయుటకు వీలులేదు. ఏసమాజం అయిన తన ఆఫీసుకు నివాసం ఏర్పాటుచేసికోవాలంటే స్టేటు, బిల్డింగును చూపిస్తేనే చేయగలదు. స్టేటు, స్థలంచూపించి తేనేగాని, సభలు సమావేశాలు జరుపటానికి వీలులేదు. అయితే ఆ అంశ్యతాలు జరిగిన తరువాత వాటిని నమ్మటం మంచిది. ముందుగామాత్రం నమ్మరాదు.

సోవియట్ యూనియన్, చైనాలో, నిరంకుశత్వం, సమిష్టి విధానం రెండూ కలిసేవున్నవి. కమ్యూనిస్టులు సంపాదించి అధికారం వహించే రాజ్యాలలో రాజకీయంగా వారు సాధించిన దాన్నిగూర్చి తృప్తిపడ్డారు. వాళ్ళ అర్థంలో స్వేచ్ఛ అంటే పోలీసురాజ్యం. "మనరాజ్యంలో నిరంకుశ విధానం అనవసరంగా తోస్తున్నది. దోపిడివిధానాన్ని రూపుమాపాం. నిరంకుశంగా అణచటానికి యింకేమరూలేదు." అన్నాడు స్టాలిన్ పరిస్థితులలో మార్పేమీలేదు. "అణచే విధానంలేదు" బి అండ్ కె అన్నారు.

స్వాతంత్ర్యం భేదాను, విభాగాన్ని తెస్తుంది. స్వేచ్ఛా సమాజంలో మార్పుకావాలనేవారు, అవుసరం లేదనేవారు, నమ్మకంగలవారు, లేనివారు పనిచేసేవారు చెయ్యనివారు, రాడికల్సువుంటారు. యదార్థమైన భేదాలను, ప్రతిపక్షాన్ని

లిబరల్ ప్రజాస్వామికం సృష్టిస్తుంది. వివిధరకాలైన వారం దరూ పరస్పరసహకారంతో సామరస్యంగా వుండుటకు వీలుం డును. భిన్నివర్గాలు సొంతశ్రేణీకరణం చేయుటకు అవకాశముం టుంది. కమ్యూనిస్టు పరస్పర యీ వ్యత్యాసాలను. ప్రతి పక్షంయొక్క హక్కును గమనించదు. కమ్యూనిస్టు తాను చెప్పినదే సత్యం; ధర్మం అంటాడుగాని మంచిచెడ్డలను పాటిం చడు. కమ్యూనిస్టుల సమాజం ఒట్టమాన్ టర్కుల ప్రజా పీడనపద్ధతికి సమానంగా వుంటుంది. మానవులను బానిసలుగా జంతువులుగా చూస్తారు. యదార్థమైన సామ్యవాదసమాజంలో వ్యతిరేకతకు, ప్రతిపక్షానికి, వ్యత్యాసాలకు తావులేదని కమ్యూనిస్టు చెబుతాడు. కారణం అందరియొక్క ఆర్థిక స్థోమత సమానస్థాయిలో వుంటాన. అందరిమనస్సులుఒకేవిధంగా వుండును. రాబడి సమానంగా వున్నప్పటికి విధులు, ఆచర ణలు వ్యత్యాసాలుగా వుండునని కమ్యూనిస్టుకు తెలుసు. ఆర్థికరంగంలో సమానంగా వున్నవారందరు ఒకేవిధంగా వుంటారని అనుకొనుటకు ఆధారంలేదు. (స్వేచ్ఛా సమాజా లలో ఆస్తి హక్కుదారులు విడివిడిగా వుంటారు, రైతులు కూలీలు అదేవిధంగా వుంటారు.)

వస్తుదా కమ్యూనిస్టు స్వభావాలు ఏమైనప్పటికి, వారికి సహాయపడినవారు, లెనిన్, రష్యాను సంపూర్ణమైన నియం తృత్వ ధోరణిలో నిర్మించారు. గడిచిన కొద్ది సంవత్సరాల లోను, కమ్యూనిస్టులు ఏ దేశాలలోనైతే అధికారం సంపా దించారో, అక్కడల్లా నియంతృత్వాన్ని స్థాపించారు ఒకసారి

సమాజాన్ని ఏర్పాటుజేస్తే, దానిని రూపుమాపటం సాధ్యం కాదు. సమాజాలు భావాలతో సంబంధంలేకుండా వుండును. నియంతృత్వాలు ఏర్పడి, అవి ఏర్పాటుచేసినవారి వాంఛల లోనే కూలిపోయిన సంఘటనలు చాలాకొద్ది. లోన బయట వున్న తగాదాలవల్ల కూలిపోవచ్చును. ఈరెండు లేకపోతే, నియంతృత్వాలు శతాబ్దాలతరబడి వుండును. వ్యక్తిత్వంయొక్క స్వేచ్ఛ, ప్రభుత్వంమీద ప్రజలకు అధికారం, ప్రతిపక్షాల హక్కులు కమ్యూనిస్టుల ఆలోచనలలో వుంటే, వారి దృక్ప థంలో మార్పువచ్చుటకు ఏసవంతమైనా అవకాశముంటుంది. అయితే ఈభావాలనే కమ్యూనిస్టు నిశితంగా విమర్శించాడు. ఈభావాలందు వారికుండే ద్వేషం, వారిని, సామ్యవాద మార్గా న్నుండి తప్పించినది.

ప్రతిపక్షాలను, వ్యతిరేకతను పూర్తిగా నిర్మూలించిన తరువాత, స్టేటుయొక్క నిరంకుశాధికారాలను అణచివేయు వచ్చునని అనుకొనుటకు వీలున్నది. వాస్తవంలో అధికారం చెలాయించటమేగాని, తీసివేయటం మాత్రం జరగదు. ప్రజా నీకంమీద బలవంతంగా కమ్యూనిస్టుల వాంఛను రుద్దటం మాత్రం జరుగుతుంది. అందుకు విరుద్ధంగా జరుగుతుందని భావించటం కల్ల. ఈవిధంగా కమ్యూనిస్టులు చేయకపోతే వారిని కమ్యూనిస్టులు అనుటకువీల్లేదు. ప్రజాస్వామిక సామ్యవాదాన్ని పూర్తిగా వ్యతిరేకిస్తారు.

కమ్యూనిస్టు స్టేటులో నియంతృత్వాధికారం పోయి, ప్రభుత్వంమీద ప్రజలకు అధికారం వుండటం మాత్రం వాస్త

నానికి దూరమైన విషయం. రాజకీయవైజ్ఞానిక విషయాలలో ఏమాత్రపు సడలింపుగల్గినా అభిప్రాయభేధాలకు, ప్రతిపత్తులకు, మార్పులకు ఆస్కారం వుంటుంది. ఇది కమ్యూనిస్టు వుద్యమానికే మూలవిరుద్ధం. అందుకని ఈ భావాలను కమ్యూనిస్టు సహించడు. కొంతకాలంబాటు కమ్యూనిస్టుసమాజాలను ఉన్నత స్థితిలోనే వుంచినట్లయితే, నియంతృత్వసమాజాలను ఏర్పర్చుతారు. రాజకీయనిరంకుశత్వాన్ని వైజ్ఞానిక పిడివాదాన్ని, మోనాపిలి ఆర్థికవిధానాన్ని బలవంతంగా ప్రవేశపెట్టుతారు.

*

9

# లిబరల్ ప్రజాస్వామికంలో మూలసూత్రం

లిబరల్ ప్రజాస్వామికం ముఖ్యోద్దేశ్యం మానవ వివేకోదయం కల్గించటం మాత్రమేకాదు. నిద్రపోతున్న మానవ జాతిని పరిపూర్ణాధికారంనుండి తప్పించటం మాత్రమేకాదు. సంకెళ్లనుండి బయటపడిన మానవజాతినీ ఎదుర్కొనే ప్రతిబంధక శక్తులను రూపుమాపటం. ఈ శక్తులను ఎదుర్కొనుటకు, స్వేచ్ఛాభావాన్ని, లిబరల్ భావాన్ని, శాస్త్రక్రమాన్ని అమలులోపెట్టాలి. సనాతనభావాన్ని విసిరేసి కొత్తరూపం యివ్వాలి. French Philorsphes, వారిఅనుయాయులు, German Anfnlaerung, ఫ్రాంక్లిన్, జెఫ్పర్సన్ వారి అమెరికన్ స్నేహితులు, మానవస్వభావాలలోను, ప్రకృతినైజాలలోను నమ్మకంగల వారి భ్రమలుకన్నా ఆధారం చాలా తక్కువ.

యింతచారిత్ర వున్నప్పటికీ యీ రోజు కొద్దిమంది మాత్రమే లిబరల్ ప్రజాస్వామికం వైపున లిబరల్ సమాజం వైపుకు మొగ్గుతున్నారు. చాలామందికి స్వేచ్ఛయొక్క వ్యతిరేకార్థమైన స్థితిమాత్రమే తెలుసు. స్వాతంత్ర్యంమీద ద్వేషం వహించినవారితో చేతులుకలిపి, కొత్తమార్గాలు రావాలంటూ ప్రచారంచేసేవారు పరిస్థితులను గమనించలేదు. (గడిచిన

6 సంవత్సరాలలోను లిబరల్ ప్రజాస్వామికం విజయాలకన్నా అపజయాలనే పొందినది. అధికారత్వం ప్రబలిపోతున్నది. స్వతంత్రజాతులమని చెప్పుకునేవారు స్వతంత్రులు మాత్రమే. వారిని సాంప్రదాయక లేక రాడికల్ నియంతల నిరంకుశత్వంతో పరిపాలిస్తున్నారు.) ప్రజాస్వామికాన్ని మొత్తంగా గమనించకపోవటమే యీ పరిస్థితికి ఒక కారణం.

స్వేచ్ఛమీద ఆధారపడినపద్ధతి నిగ్రహించుటకు ప్రజలు కొన్ని ముఖ్యవిషయాలు తెలుసుకోవాలి. పార్లమెంటరీ వ్యవహారాలు, వ్యక్తిత్వం, హేతువాదం, వ్యక్తిస్వేచ్ఛ, సొంత ఆస్తి, ఉత్పత్తిసాధనాలను పొందివుండటం మొదలగు విషయాలు గ్రహించాలి. అందరిని సమానంగా చూచేభావాలు, తార్కికదృష్టి, తగిన ఆధారాలు, మనం నివసించే ప్రపంచంలో జరిగేదానికి తృప్తికరమైన సమాధానంవుంటే, పైవిషయాలు అర్థంఅగును.

ఆర్థిక, మిలిటరీవర్గాల విఘులు పలుకుబడి ఎలా వున్నప్పటికీ, యీరోజున మానవస్వభావశక్తిని విజ్ఞానవేత్తలు మాత్రమే తరుచు నిరూపిస్తున్నారనేసంగతి మరచిపోతాం. ఒక వుద్యమం జయప్రదం కావాలంటే, మానసికస్వభావాల ఫలితాలమీద ఆధారపడివుంటుంది. ఆ మానవశక్తిని బలంగానూ, స్పష్టంగాను వుండేటట్లు చేస్తే, ఆ వుద్యమానికి బలం చేకూరుతుంది. విజ్ఞానవేత్తలు సామాన్యంగా పనిచెయ్యరు. పనిచేసే విధానాన్ని ఇతరులకు వదిలివేస్తారు. నూతనభావాల్ని సృష్టించి వాటిని ప్రవేశపెట్టేవిధానాన్నిగూర్చి సూచనలు చేస్తారు. జనసామాన్యంలో వున్న సాధారణశక్తి యొక్క స్వభావం, చిన్న

సమాధానం దొరికింది. కమ్యూనిస్టు చేసేపనులకు లెనినును మార్గదర్శకుడుగా భావించాడు.

అనేకమంది లిబరల్ స్వభావానికి వ్యతిరేకంగావున్నప్పటికి, ప్రపంచంలో లిబరల్ స్వభావాన్ని అర్థంచేసికొని దానికి తగినబలం చేకూర్చాలనేవాళ్లుకూడా తగినంతకాలం లేకపోలేదు. గడచిన మూడుశతాబ్దాలలోజరిగిన లిబరల్ విప్లవాలు, మార్పులువెనుక స్పష్టంగా నిర్ణయించబడి అర్థంచేసికొన్న భావం వున్నది. ఆభావాన్ని అమలులోపెట్టుటకు సమాజాలను నిర్మించారు. లిబరల్ ప్రజాస్వామిక ప్రచారానికి అనువుగా చేశారు. ఈ సమాజాలలోనే జాతులు పెరిగినవి. నవీన భావాలకన్నా అభివృద్ధిని సాధించినవి. వంద, రెండు, మూడు వందల సంవత్సరాలకన్నా యీరోజు యదార్థం వ్యత్యాసంగా వున్నది. లిబరలిజాన్ని కదిలించే స్వభావం ప్రస్తుతకాలంలో వలె గతంలోకూడావున్నది. అయితే జప్పర్సన్, మీరాజ్యూ, హోమ్‌బోల్డులకు తృప్తికరంగావున్న లిబరల్‌సూత్రం యిప్పుడు అస్పష్టంగాను అసంతృప్తిగాను వున్నది.

లిబరల్ భావాన్ని వ్యక్తంచేయటం అతికష్టమని మనం వింటూవుంటాం. పరస్పర విరుద్ధమైన స్థితిలోను స్వభావంలోను వుంటుందనికూడ చెబుతారు. తరుచు లిబరల్సు సోమరులుగా వుంటారు. ఎందుకంటే స్వేచ్ఛను జ్ఞానదృష్టితో చెప్పటం అతి కష్టమైన విషయం. లిబరల్ ప్రజాస్వామికం ఒక పద్ధతి. అది ఒక పద్ధతిగనుక దానికి తప్పనిసరిగా ఒకభావం వుండాలి. దాని చుట్టూ దానికి అనువుగావుండే భావాలు తిరుగుతూవుండును. ఈపద్ధతిని అర్థం చేసికొనటం సులభమైనది కాదు. ఇతర పద్ధ

గాలకు దీనికి వ్యత్యాసమున్నది. లిబరలిజం ప్రధానాంశం వాస్తవమైనపద్ధతి. లక్ష్యంలో యితరవిధానాలలో తారతమ్యం వున్నది. లిబరల్ ప్రజాస్వామికంలో ప్రతిపత్తులు వుండ వచ్చును. పరోపకారం, అహంకారం, వ్యక్తిత్వం, సమిష్టి విధానం - వీటికి ఆటంకాలు లేవు. ఏకత్వానికన్నా అనేక త్వాన్నే ప్రోత్సహిస్తుంది. ఎనుకొన్న శక్తులను మితంలో వుంచుతుంది. నాశనం చెయ్యదు. సోవియట్, టిటో కమ్యూ నిజం, జాతీయవాదం, ఇస్లాం లేక క్రైస్తవుల సంప్రదాయాల కన్నా, లిబరల్ ప్రజాస్వామికాన్ని అర్థంచేసికొనుటకు పెద్ద ప్రయత్నం అవసరం.

ఇతర వుద్యమాలలో జరిగేదానికి, లిబరలిజంలో పూర్తి వ్యతిరేకత వుంటుంది. (లిబరలిజం పలుకుబడివల్ల వచ్చిన లిబరల్ సోషలిజం మినహా) లిబరల్సు ప్రజలనుండిగాని, కార్య క్రమాలమీదగాని పరిపూర్ణత ఆశించారు. పైగా యితర విధానాలలో వున్న రెండు ముఖ్య విషయాలమీద అభిప్రాయ భేధంగా వుంటారు. మానవస్వభావంలోవున్న హద్దులను, అసం పూర్ణత విషయాలు లిబరల్సుకు తెలును. భావాలను, కార్య క్రమాలను తిరిగి పరిశీలించుటకు సిద్ధంగా వుంటారు. వారి ప్రధానఆశయం పద్ధతి నిర్మాణంనుగూర్చి మాత్రమే. తక్కువ బాధతో, తక్కువ కష్టంతో మార్పు తెచ్చుటకు ప్రయత్నం చేస్తారు. సోషలిజం పరిపూర్ణదశకు వచ్చేటప్పటికి మార్క్సిజం శక్తి అంతరిస్తుందని అంటారు. కాని లిబరలిజానికి చివరదశ అంటూ వుండదు.

ఈరోజు లిబరల్ ప్రధానాశయాన్ని ప్రస్ఫుటంగా అమెరికన్‌జాతి తెలుపుతున్నది. లిబరల్‌సమాజం వుండాల్సిన విధం నిరూపిస్తున్నది. (అయితే యితకు లిబరల్ సమాజాలు వుండవని లేవని దీని అర్థంకాదు. పశ్చిమోత్తర ఐరోపాలో వున్న 10, 12, జాతులలోకన్నా, ఈనాడు అమెరికాలో లిబరలిజం ఎక్కువమోతాదులోనే వున్నది. అమెరికా సంప్రదాయపద్ధతి లిబరలిజాన్ని అనుసరించివున్నదని యల్. హార్ట్జ చూపించాడు. అమెరికన్‌జాతిని సరిదిద్దటంలో లిబరలిజం ప్రధానశక్తి పనిచేయుచున్నది. నిరంకుశత్వానికి మొగ్గుజూపే రాడికల్సు, మైకార్థియిట్సు, వ్యాపారులు, కూలీనాయకులు వున్నా లిబరలిజం ప్రభావం తగ్గలేదు. యితరదేశాలకన్నా లిబరల్ ప్రజాస్వామికం శక్తివంతంగా, పురోగమించేందుకు ఎంతో వీలుగా ఈనాడు అమెరికాలో వున్నది.)

యునైటెడ్ స్టేటులో అర్థంకాని పరస్పర విరుద్ధమైన విధానాలు, మిడిమిడిజ్ఞానంగల మతోన్మాదులు నమ్మకాలు, ఆర్థికతలంపులు వున్నవని American Conservation వ్రాసిన గ్రంథకర్త అన్నాడు. వీటిని వదలిచూచినట్లయితే, జరిగినదానికి, జరుగుతున్నదానికి ఐక్యత, ఒకవర్గానితో మరొక వర్గానికి సన్నిహితసామ్యం, పరస్పరసహకారంతో వుండటంవల్ల పొందే ప్రయోజనాలు విశదంగా కనపడుతున్నవి. ఒక్కొక్కప్పుడు అమితంగా కష్టపడాల్సివుంటుంది. తెల్లవారికి, నీగ్రోలకు, చర్చిలో నమ్మకం గలవారికి, లేనివారికి, వ్యాపారస్తులకు కూలీలకు జాతీయవాదులకు, అంతర్జాతీయవాదులకు, పాతరిపబ్లికనులకు కొత్తవారికిగల వ్యత్యాసాలను మార్పుచేయుటకు కష్టపడాలి.

అందరు మితంగాను, సమానంగాను వుండేందుకు, రక రకాలైన వర్గాలు సామరస్యంతో మెలిగేందుకు సహాయపడ టమే లిబరలిజం ఆశయం. ఈ ఆశయంకోసమే అమెరికాజాతి లిబరల్ ప్రజాస్వామికంకోసం ముందంజవేస్తున్నది. అమెరి కనులు అనుసరించే పద్ధతిమీాదనే వారి ఐక్యత ఆధారపడినది. ఆ పద్ధతినే లక్ష్యంగా పెట్టుకున్నారు. అమెరికన్ విధానంలోని నమ్రతకు యిప్పటివరకు పూచీయిచ్చిన పద్ధతి – అనేక పరి శోధనలకు అవకాశమిచ్చిన పద్ధతి – అనేక దేశాలలో, అనేక కాలాలలో వున్న మతాన్ని సంయోగంచేసింది. 19వ శతా బ్దంలో అమెరికాలో, యితర ఐరోపా దేశాలకంటే, సోషలిస్టు వర్గాలవారు అనేకమంది వున్నారు. అయినను అందరిని సమ న్వయం చేసింది.

అనేకమంది రచయితలు యీా పద్ధతినిగూర్చి వర్ణిం చారు. "మనం యివ్వాల్సింది ఏమిటి?" "ఒకపద్ధతి" అంటూ But we were fun free అనేపుస్తకంలో కె. డేవిస్ వ్రాశారు. అమెరికన్ సమాజాలకు మార్గమేమిటి? "అంగీకారంలో ఏర్పడే ప్రభుత్వం." అంటూ Call to greatness అనే పుస్త కంలో స్టీవెన్‌సన్ వ్రాశారు. కాలేజీలలోగాని, ఆఫీసులలో గాని, కార్పరేషన్, చర్చిలలోగాని ఒకపద్ధతిని అనుసరించాలి. ప్రజలంతా ఒక బల్లముందు సమావేశమై చర్చిస్తారు. వాళ్ళను ఎన్నుకున్నవారికి ప్రాతినిధ్యం వహిస్తారు. ఏసమస్యనైనా సమ గ్రంగా చర్చిస్తారు. రాబోయే ఫలితాలనుఊహిస్తారు; మంచి, చెడు ఆలోచిస్తారు. "యిదీ పరిష్కారమార్గం" అని నిర్ణయం మాత్రం చేయరు. "ఈమార్గాన్ని ప్రయత్నించేసిచూద్దాం"

అని అంటారు. అదిపనిచేయకపోతే ఇంకోమార్గాన్ని ప్రయత్నం చేసిచూస్తారు. లౌకికపు వ్యవహారాలనుఅధికారంవైపుకు ప్రమేగ్గనీయరు. 1000 సం॥ రాలక్రితం పాశ్చాత్య దృక్పథం ప్లేటో భావాలతో నిండుకున్నది. 500 సం॥ రాలు అరిస్టాటిల్ ప్రభావంతో నిండుకొని వున్నది. పవిత్ర గ్రంథాన్ని మూఢత్వంతో పూజించేవారువున్నారు. ఇట్టిపరిస్థితులు యునైటెడ్ స్టేట్సులో లేవు. ఇంకా మూఢంగా నమ్మే హెగిల్ తార్కికవాదంగాని, మార్క్సియన్ డైలెక్టిక్సుగాని, గుడ్డిగానమ్మే ఉద్రేకాలుగాని, ఆవేశాలుగాని లేవు. హేతువాదదృష్టి ప్రబలంగావున్నది.

అమెరికన్లు బ్రిటిష్‌వారి అడుగుజాడల్లో నడుస్తున్ననూ, అనుభవంలోమాత్రం పద్ధతినే ఆదర్శంగా పెట్టుకున్నారు. వారి రాజ్యాంగంలోకూడా పద్ధతినే నొక్కి చెప్పారు. అయినా రాజ్యాంగంలోనే బయలుదేరరాదు. 1774 కాంటినెంటల్ కాంగ్రెసులో, 1787 రాజ్యాంగసభలోను అమెరికన్లు మేధా సంపత్తిని వినియోగించి, పద్ధతియొక్క అర్థాన్నిగ్రహించి ఆచరణలో పెట్టారు. 1909 అమెరికను జాతినిగూర్చి చెప్పాలంటే, వైజ్ఞానిక విప్లవాన్ని ముందుగా చెప్పాలి. ఆ వైజ్ఞానికవిప్లవానికి పునాదులు వేసినవారు, బెకన్, గ్యాలిలో, న్యూటను, మిల్, పియిర్సు, వసన్లా. చనిపోయినవారిని చెప్పటమేమంచిది. పిడివాదానికి, మూఢభక్తికి, మూఢనమ్మకాలకు, దౌర్జన్యానికి, హింసను వైజ్ఞానికవిప్లవం ఎదుర్కొన్నది. అది విప్లవం అని ఎందుకన్నామంటే, సంపూర్ణాధికారాన్ని ఎదిరించి పద్ధతిని శానిసగా చేయలేదు. ఈ పద్ధతిని అనేకపేర్లతో పిలుస్తారు. అను

మానాన్ని శాస్త్రజ్ఞానాన్ని రెంటినీ మిళితంచేశారు. అవి భావాల్ని ఉత్పత్తిచేసినవి. ఆ భావాలు స్వతంత్ర ఆలోచనా శక్తితో కూడుకొన్నవి. స్వేచ్ఛయొక్క ఆధారం స్వతంత్ర ఆలోచనమీద ఆధారపడి వుంటుంది రెంటినీ విడదీయుటకు వీల్లేదు. సిద్ధాంతాన్ని, నిర్ణయాలను విలువకట్టి మార్చుటకు అవకాశమున్నది.

కొంతకాలం క్రిందట Preures అనే ఫ్రెంచిపత్రికలో, టర్కీనుంచి ఒక విలేఖరి తూర్పువున్న జాతియొక్క మిత భావాల్ని వివరించుటకు ప్రయత్నంచేశాడు. సాంకేతికమైన ప్రశ్నమీద ఆధారపడలేదు. పురాతనభావాలు, విలువలమీద ఆధారపడిన సమాజాలలోని హెచ్చుస్థాయిని, సామర్థ్యంమీద ఆధారపడక, గమనిక, పోలిక విమర్శనాసృష్టిని ఆధారంగా తీసికొని యదార్థాన్ని నిరూపించుటకు ప్రయత్నించాడు. పక్షపాతం అభిప్రాయానికి అనుకూలంగానే వున్నది. “ఇంగిత జ్ఞానం సరిగావుంటే చేసేపనులు సరిమార్గాన్నిబట్టివు” అని నమ్మాడు. పిడివాదం, మూఢవిశ్వాసంతో జ్ఞానాన్ని వమ్ము చేయకూడదన్నాడు. ఈ ఇంగితజ్ఞానంవల్లనే గత తరాలలోని అమెరికన్లను దురభిమానంనుండి తప్పించి, విశాలమనోభావం గల సమాజానికీ, యితర ప్రజాస్వామిక దృక్పథాలకు మార్చింది. మూఢ మత విశ్వాసాలను సనాతనభావాలను అటకాయించింది. హెలియన్ జోషప్సు పిడివాదాలను మార్పుజేసి రాయిస్ స్థూలప్రపంచ కల్పనను వాదానికి, నార్మన్ థామస్ హ్యూమ నిజానికి మార్గంచూపింది.

“అమెరికన్ స్వభావం పరిశోధన. పాతప్రపంచం

శాశ్వితమైన మార్గంకోసం వెదుకుతున్నది." దీన్ని అమెరికన్ విజ్ఞానవేత్తలు తిరిగి ప్రవేశపెట్టాలని ఆతురతపడుతున్నారు. పురాతనభావాలతో కుమిలిపోయేవారికి, స్వేచ్ఛను ప్రసాదించి కొంతమందికి వివేకోదయం కల్గించింది, అమెరికన్ పరిశోధనా ప్రభావం. ఈ పరిశోధన పలుకుబడి, ప్రభావం కామన్‌వెల్తు జాతులలోను, కాంటినెంటల్ ప్రజాస్వామికాలలో విరివిగా వున్నది. దాని ఫలితంగా స్వేచ్ఛాసమాజాలు పునాదిలో ఏర్పడినవి. ఈ పరిశోధనాస్వభావం అమెరికన్‌జాతికి ఉత్తేజం కల్గించింది. జాతీయంగా ఆలోచించుటకు వీలుచేసింది. అమెరికా యితర దేశాలలో స్వేచ్ఛా సమాజాలు వృద్ధిచెందాలంటే, యీ పరిశోధనాస్వభావం మీదనే ఆధారపడివుంటుంది.

చైనీస్, రష్యాయన్సు, స్పానిష్‌డొమినికన్సు, ఆఫ్ఘను లకు లిబరలిజాన్ని అర్థంచేసుకొనటం కష్టమైన విషయం. ఆ దేశాలలో ప్రజానీకం ఆచరించే పద్ధతిమీదగాక, లక్ష్యానికే అలవాటుపడ్డారు. లక్ష్యాలు, సిద్ధాంతాలు, పద్ధతులు అన్నీ ఒకటిగా భావించారు. యదార్థంతో కలిపివేశారు. (మార్క్సు బైబిలు, కొరాన్ కనుగొన్న సత్యాలు) పద్ధతులను, లక్ష్యా లను సత్యంయొక్క స్థాయిలో వుంచుతే అది అభివృద్ధిని సాధించ లేదు. కీడును ప్రోత్సహిస్తుంది. రాడికల్సు, రాజకీయ సాంఘిక విప్లవాలను చవిజూచిన జాతులలోకూడా, యీ వైజ్ఞానిక విప్లవంవల్ల పిడివాదంనుంచి బయటపడలేదు. స్వేచ్ఛ అంటే వారికి నిరర్థకంగా వుంటుంది. అనుభవంలో మంచి యజమాని వుండాలనే సిద్ధాంతానికి మించిపోలేదు. యజమానులులేని సమాజాలను ఊహించలేదు.

లిబరల్ ప్రజాస్వామిక జాతులలో కూడ, స్వేచ్ఛ అర్థాన్ని గ్రహించలేకుండా వున్నారు. లక్ష్యంకోసం పనిచేయటం సులభంగానే వుంటుంది. అది పద్ధతిని విషమస్థితిలో పెట్టినప్పుడు వదులుకోవాలి. అనేక దేశాల్లో ప్రజలు ఏమి చేయ్యాలో, దేనికిచేయ్యాలో చెబుతారు. కొంతమందికి తెలుసుకూడాను. స్వర్గంలో ముక్తికి, ప్రపంచంలో ముక్తికి, రాజకీయ ఆర్థిక సాంఘికలక్ష్యానికి, పద్ధతిని అపాయంలో పెట్టనంతవరకు లక్ష్యాన్ని లిబరలిజం గుర్తిస్తుంది. అవి హద్దులలో మితంగా వున్నంతవరకు కాపాడుతుంది. లిబరల్ తన కోసం యితరులకోసం పనిచేయగలడు. అతని దగ్గరవున్న ఉత్పత్తిసాధనాలను ఎక్కువ ఉపయోగానికి, తనకు ఉపయోగ పెట్టగలడు. కాపిటలిజంలోకూడా భాగస్వామి కాగలడు; సహాకారసమిష్టిసంఘాలను స్థాపించగలడు. గ్రేటుబ్రిటను, యునైటెడ్ స్టేట్సు, స్వీడన్ ఫిన్లాండులలో ప్రజలు ప్రత్యేక వర్గాలుగా వుండుటకు అభ్యంతరపెట్టరు. మతసంస్థలు – మొదలగునవి ఆస్తికుడుగాను, నాస్తికుడుగాను వుండవచ్చును. క్లిష్టపరిస్థితులు వచ్చినప్పుడు యుద్ధంలో చేరవచ్చును. లేక ప్రశాంతంగా వుండవచ్చును. ఏవిధమైన లక్ష్యాన్ని అనుసరించినప్పటికి, సమాజాన్ని నిర్మించటంలో అవసరమైన ప్రధానసూత్రాలకు వ్యతిరేకంగా లేనంతవరకు లిబరలుగా వుండవచ్చును. వ్యక్తిత్వం, సహనం సహించాలి. మితంగావుండాలి.

సామాన్యంగా లిబరల్ ప్రజాస్వామిక జాతులు అనేక

వర్గాలుగా వుండునని స్పష్టంగా తెలుస్తున్నది. విషమ పరిస్థితి వచ్చినప్పుడు ముఖ్యంగా లిబరల్సు ఐక్యతతో ఎట్లు వుండ గలరు? ఐక్యతతో వుండరని నిదర్శనాలు వున్నవి. లిబరల్ ప్రజాస్వామిక రాజ్యాలలోని పౌరులందరు పద్ధతినే నమ్ముతారు గనుక, దానికి భగం రాకుండా వుండేందుకు ఐక్యతతో వుండక తప్పదు. స్వేచ్ఛను కాపాడాలంటే యిదొక్కటే మార్గం- అని నమ్ముతారు. దానికితోడు అనేక విషమపరిస్థితులలో పరిష్కార మార్గాలు కొద్దిగానే వుంటాయి. ఒకొక్కప్పుడు ఒకే మార్గం వుంటుంది. స్వేచ్ఛకు బలం చేకూర్చి సమస్యలను ఎదుర్కొంటారు. స్వేచ్ఛకే ఎక్కువగా కట్టుబడివుంటే, ఆ నిర్ణయానికే మెజారిటీవారుకూడా రాకతప్పదు. (ఈరోజు ఎదుర్కొంటున్న సమస్యలు జాతితత్వం, వలసవిధానం, గుత్త కొనటం మొదలగునవి. వీటికి లిబరల్ పరిష్కారమార్గం వున్నది. విశేషాధికారాలను తగ్గించటం.)

పైచెప్పినదానిని ఆధారంగా తీసికొని చూస్తే, లిబరల్ ప్రజాస్వామికం అర్థంచేసికొనుట సులభంగా వుంటుంది. ఇతర సిద్ధాంతాలతో ఏకీభవించదు. లిబరల్ ప్రజాస్వామికం పద్ధతినే నొక్కి చెబుతుంది. ఇంకొక కారణం, లిబరల్ ప్రజాస్వామి కంలో హేతువాద దృక్పథం హెచ్చుగా వుంటుంది. పిడి వాదాన్ని రూపుమాపుతుంది. విజ్ఞానదృష్టిని ప్రబలంచేస్తుంది. 13 వ గ్రెగరీ ప్రాచీన సంప్రదాయం, పోచిడొనోస్టేవ్ పురాతన ఆచారాలకు, లిబరలిజానికి పొందికలేదు. మార్క్సు, హెస్ట్

మాన్ సోషలిజాలతో సంబంధంలేదు. నాజరుచెప్పే జాతీయ వాదంతో పొందికలేదు. స్మాక్, నెహ్రూల, బార్గ్యూబాలతో కాదు.

అభివృద్ధిని కాంక్షించేవారి మనోభావాలతో లిబరల్ ప్రజాస్వామికం అంటే, వ్యతిరేకతను ఐక్యతను సమన్వయ పర్చటం. మానవజాతినుండి కౄరత్వాన్ని, నిరంకుశత్వాన్ని తొలగించటం. పాత కొత్త సిద్ధాంతాలలోని ఏకత్వాన్ని తొలగించి అనేకత్వాన్ని ప్రోత్సహించటం. గ్రేటు బ్రిటనులో మత వర్గాలు, రాజకీయవర్గాలు కలహించకుండా సామరస్యంతో వుండేపద్ధతి కావాలని లాక్ వాంఛించాడు. మాడిసన్ను రాజకీయ ఫెడరల్ పద్ధతికూడా వర్గాలన్నీ సమంగా వుండాలని కోరింది. శాంతిని కాంక్షించినది. 1688 విప్లవంవల్ల గ్రేటు బ్రిటనులో నెలకొల్పబడిన సమాజాలవంటి సమాజాలు, ఫ్రాంసుకు కావాలని మీరాబ్యూ చెప్పాడు. ఫాల్మన్, గాగెరన్, కాంపెన్హాసెన్ల దృక్పథాలలో లిబరలిజం అర్థం, జర్మను కాథలిక్కులు, ప్రొటెస్టెంటులు, ప్రజాప్రభుత్వం, సార్వభౌమత్వాలు, పరిశ్రమలు, వ్యవసాయం సన్నిహితంగా వుండాలన్నారు. ఒట్టమాన్ రాజ్యంలో ముస్లింలు, క్రైస్తవులు, అరబ్బులు, టర్కులు, పల్లెటూరి పట్టణపువాసులు, సామరస్యంతో వుండాలని కోరారు. అదే లిబరలిజం అని కెమల్ పాషా భావించారు.

ప్రతిచోటా విప్లవాన్ని లేవదీయుటకు బలంవున్నా,

కొద్ది జాతులలోనే లిబరలిజం ప్రభావం ఎక్కువగా వున్నది. జయాన్ని సాధించటం పరిమితిగావున్నా, లిబరలిజం పట్ల ప్రోప కాదని ఋజువైనది. 5 మిలియన్లు స్విస్ జాతివారికి, 10 మిలియన్లు ఆస్ట్రేలియనులకు వీలుగావున్నట్టి సిద్ధాంతం అన్ని దేశాల వారికి, అన్ని జాతులవారికి తప్పక వీలుగావుంటుంది. లిబరల్సు స్వల్పసంఖ్యలో వున్నప్పటికి, వారి ఆత్మవిశ్వాసంలో, నమ్మకంతో వారి సిద్ధాంతంమీద ఆధారపడి, పరిపూర్ణాధికారాన్ని చలాయించేవారిని ఎదుర్కొంటుంది.

*

# 10

## లిబరల్ ప్రజాస్వామిక మార్గం

ఈరోజు కమ్యూనిస్టులు నిన్నటి ఫాసిస్టులవలె, సంప్రదాయవాదుల, జాతీయవాదులవలె లిబరల్ ప్రజాస్వామికాన్ని ద్వేషిస్తారు. "స్వేచ్ఛ, అభివృద్ధి, మానవుని, మానవజాతి భవిష్యత్తు, సహనం, ఔదార్యం—వీటిమీద పనికిరాని గలభా మాటలు దేనికి? మనచుట్టూ పరిష్కరించవలసిన సమస్యలు అనేకంగలవు. లిబరలు ప్రజాస్వామిక రాజ్యాలలో, లిబరలు ప్రభావం ఎక్కువగా వున్నచోట, అజమాయిషీ వహించిన చోట, ఉద్రిక్తపరిస్థితి రక్షణ లేకపోవటం, అస్థిరత వున్నది. బానిసత్వంలో క్రుంగుచున్న జాతులవర్గాలు స్వాతంత్ర్యంకోసం గోలచేస్తున్నవి. మైనారిటివర్గాలు వారి హక్కులకోసం పోరాడుతున్నారు. దోపిడీవిధానం, నిరుద్యోగం, దుబారావ్యయం వున్నవి. మిలియన్ల ప్రజానీకం బాధలతో కృంగిపోతూవుంటే, శాంతికి భంగకరంగావుంటే మేఘాలలోకూర్చుని స్వేచ్ఛను గూర్చి వుపన్యాసాలు యిచ్చినందువల్ల ప్రయోజనం ఏమిటి? అట్టివారికి యదార్థంతో సంబంధంలేదు.

లిబరలు ప్రజాస్వామిక దేశాలలో నివసించే మనం నిష్కల్మషంగా, నిర్దుష్టంగా వుంటాలి. లిబరల్సు, లిబరలు ప్రజాస్వామికంవల్ల లాభంపొందినవారు—ముఖ్యంగా ఉత్తర

అట్లాంటిక్ జాతులలోని వ్యాపారస్తులకు చెందినవారు జరుగు చున్న సంశయాలను జాగ్రత్తగా గమనించారు. నానాటికి పెరుగుతున్న అధికారప్రాకితమైన జాతీయవాదం, సంప్రదాయ వాదంతో, కమ్యూనిజంతో బహుశ మనం ఎదుర్కోవలసిన అగత్యం రాకపోవచ్చును. చూచుటకు నేత్రాలు, ఆలోచించు టకు మనస్సు మనకు వున్నది. పురాతన భావాలతో కరుడు గట్టిన స్థితిని తొలగించి, బాధలను తొలగించి మానవశక్తులకు స్వేచ్ఛను కల్గించిన లిబరలిజాన్ని ఊతగా తీసికొని అధికా రాన్ని చలాయించలేరు. సమస్యలు వున్నవి. వాటిని త్రోసి పుచ్చుటం అవివేకంగా వుంటుంది. స్వల్పంగా భావింపబడు తుంది. ఆముదాన్ని చూచి తేనెఅని, ముడిపదార్థాన్ని చూచి పంచదారని భ్రమపడరాదు. దోపిడీవిధానం, ఆకలి, రక్షణ లేకపోవుటం గతంలోను, యిప్పుడు వున్నవి. అయితే లిబరలు విధానరూపంలో పాశ్చాత్య నాగరికత వచ్చిన తరువాత అవి చాలామటుకు తగ్గిపోయినవి. కాని ఒక తేడామాత్రం వున్నది. బానిస సమాజంలో బాధపడేటటువంటివారు చేసే దేమీలేదు. (వెళ్ళటం-చనిపోవటం-యీావని కొంతమంది మాత్రమే చేయగలరు) వున్నటువంటి కష్టాలకు అలవాటు పడి పోతారు. నిరాశ, నిస్పృహ చెందుతారు. స్వేచ్ఛాయుతమైన సమాజంలో, బాధలు, కష్టాలు పైకివస్తాయి. ప్రజలు తెలుసు కుంటారు. వాటిని ధైర్యంతో పరిష్కరించుటకు ప్రయత్నిస్తారు.

50 సం॥ క్రితమే లిబరలిజంయొక్క ప్రభావాన్ని గ్రహిం చిన ప్రజలు, లిబరలిజం మానవుని హేతువాదదృష్టితో నడి పించుటకు మార్గదర్శకంగా వున్నది. వారి జీవితాలను వారే

నిర్మించుటకు, సమాజాన్ని నెలకొల్పుటకు దోహదంచేసింది. అనేకరకాలకు చెందిన అనేక సమస్యలున్నవి. ఒక శతాబ్దం వరకు వాటిని పరిష్కరించుటకు లిబరల్సుమాత్రమే ముందున్నారు. 1688లో విగ్గులు, 1861లో లింకను రిపబ్లికన్లు, 1871లో గాంబెట్టాను అనుసరించి వారు చేసినవిధంగా బలప్రయోగం అవసరమైనప్పుడు లిబరల్సు ఉపయోగించారు. చైనా, మెడిటెరేనియన్ సముద్రాలలో జరిగే దొంగతనాలను తీసివేయుటకు, ఆఫ్రికాలో బానిసత్వాన్ని రద్దుచేయుటకు, స్వేచ్ఛాసమాజాలను స్థాపించుటకు, స్వేచ్ఛాసంఘాలను ప్రవేశపెట్టుటకు ఒక దేశంతరువాత మరొక దేశంలో లిబరల్సు ప్రయత్నం జేశారు. రాజకీయ, ఆర్థికవిధానాలను, స్కూళ్ళను, కోర్టులను, చర్చిలను లిబరల్సు సంస్కారంచేశారు. సంస్కారం కోసం పోరాడినారు.

తరువాత అనేక జాతులలో లిబరల్సు యొక్క దృక్పథం ఉదాసీనతక్రింద మారింది. ఒక పెద్దప్రవాహం ఒక చిన్నపిల్లకాల్వగా మారింది. వారు నిర్వహించిన దానిని జూచి కొంతమంది తృప్తిపడ్డారు. మరికొంతమంది వారు సంపాదించిన స్వేచ్ఛలో యితరులకు భాగంపంచుటకు అంగీకరించలేదు. మానవస్వభావాలను, శక్తులను, స్వేచ్ఛ యిచ్చినందువల్ల బానిసత్వప్రజాతులు తిరుగుబాటు జేసే విధానాన్నిచూచి కొంతమంది భయపడ్డారు. మానవపు అభివృద్ధి యంత్రంవలె వుంటుందని భ్రమపడిపోయినారు. స్వేచ్ఛ అర్థాన్ని గ్రహించలేకపోయినారు మరికొంతమంది. వారంతా మితవాదులుగా మారిపోయినారు. బ్రిటనులో టోరీలతో చేతులుకలిపారు.

చాలావరకు అమెరికన్ రిపబ్లిక్కులలో కలసిపోయినారు. టర్కీ, అర్జెంటీనా, ఈజిప్టు జపాను దేశాలలోకూడా లిబరల్సు పేరుకు మాత్రమే వుండిపోయినారు. 1922 ఇటలీలోను, 1932 జపానులో, 1933 జర్మనీలో, 1940 ఫ్రాంన్సులో, 1943 అర్జెంటీనాలో క్లిష్టపరిస్థితి వచ్చినప్పుడు, లిబరలిజాన్ని మోసపుచ్చి, ఖూనీచేసి, వున్న లిబరలిజాన్ని కూడా స్వస్తివాచకం పలికి, అనేకమంది నియంతృత్వ అధికారవ్యామోహపరులతో చేతులు కలిపారు.

ఈ సంస్కార వుద్యమాన్ని సోషలిస్టులు తీసికున్నారు. మానవసంఘాలకు స్వేచ్ఛను యిస్తే ఉత్పన్నమయ్యే సమస్యలను గుర్తులోపెట్టుకున్నారు. అయితే లిబరలిజంయొక్క స్వేచ్ఛా వాతావరణాన్ని గమనించక వెనకంజవేశారు. లిబరల్ ప్రజాస్వామికం సాధించిన కొద్ది విషయాలుకూడా తృణీకరించారు. విషప్రచారం చేశారు. వ్యక్తిస్వేచ్ఛకు అడ్డుపెట్టారు. మానవుని పురోభివృద్ధిని సాగనివ్వలేదు. మానవులందరికి ఆహారం, నీడ యిచ్చి కాపాడుతూ నడపవల్సిందేగాని, స్వేచ్ఛ పనికిరాదనే మూఢనమ్మకంలో పడిపోయినారు. సమిష్టి విధానాన్ని పూజించారు. కూలీతో జీవించేవారికి స్వేచ్ఛ లేదని చూపిస్తూ పౌరులందరిని కూలీలుగా తయారుచేశారు. పరిపూర్ణత గల చలనంలేని రాజ్యాన్ని స్థిరత్వాన్ని కలగన్నారు. ప్రేమగలతండ్రి పిల్లలను కాపాడేవిధంగా తయారైనారు. మానవుని వ్యక్తిత్వాన్ని యంత్రంలో మరగాతయారుజేశారు. న్యాయం, వాంఛ, హేతువాదం యంత్రానికి చెందినట్లుగా చేశారు. సోషలిస్టుల కార్యక్రమంలో స్వేచ్ఛ ఎంతో అనామ

కంగా వుంటుందో "షా" నవ్వు నిరూపిస్తున్నది. సామాన్య ప్రజాసమూహంలో వారు విజయాన్ని పొందారు. ఎందువలన? వ్యక్తి పొందే స్వాతంత్ర్యంవల్ల వచ్చే సమస్యలకు పరిష్కార మార్గమున్నది. వారి మనస్సులు తప్పుడు త్రోవలో వున్నా, వారి హృదయాలు మాత్రం నిష్కల్మషంగా వున్నవి. లిబరలిజాన్ని బలహీనపర్చారు. 20, 30 సంవత్సరాల క్రితం వారు మంచి పలుకుబడిలో వున్నారు వారిని అనుసరించినవారు కమ్యూనిస్టులుగా మారిపోయినారు. లిబరల్సు త్రోసిపుచ్చిన సమస్యలకు వారు పరిష్కరిస్తామని వాగ్దానంచేశారు.

యునైటెడ్ స్టేట్సు, కెనడాలో వున్న లిబరల్సు మితవాదంనుండి తప్పుకోని సకాలంలో సోషలిజంయొక్క పురోభివృద్ధిని అటకాయించారు. ఉదాసీనత వదలి ఉత్సాహంతో సోషలిజాన్ని ఎదుర్కొన్నారు. అనేక యూరోపియన్, కామన్‌వెల్తు దేశాలలోవున్న లిబరల్సు, సోషలిస్టు వ్యతిరేకులతోను, సోషల్ డెమొక్రాటిక్ పార్టీలతోను, చేతులు కలిపి, లిబరల్ పాలసీని ప్రవేశపెట్టుటకు కృషిచేశారు. లిబరల్ ఆలోచనకన్నా పాలసీకే ఎక్కువ ప్రాధాన్యత యిచ్చారు. స్వేచ్ఛా ప్రజాస్వామిక సమస్యలను ప్రతిబింబింపజేస్తూ, సోషలిస్టు పరిశోధనలవల్ల వచ్చిన ఫలితాన్ని త్రోసివేస్తూ, తూర్పు పశ్చిమ యూరప్‌లో అనేకమంది సోషల్ ప్రజాస్వామిక వాదులు, సోషలిజంనుండి లిబరలిజం వైపుకు వచ్చారు. లిబరల్ ప్రజాస్వామికం, సోషల్ ప్రజాస్వామికం తెగదని గ్రహించారు. లిబరల్ ప్రజాస్వామికమే ఆధారంగా పెట్టుకున్నారు ఒకప్పుడు విప్లవాత్మకమైన లిబరల్సును ప్రోత్సహించినట్లుగా, లిబరల్

ప్రజాస్వామికం, సోషల్ ప్రజాస్వామ్యానికి బదులుగా వుండ గలదని, లిబరల్ సంస్కార వుద్యమంతో బలపడగలదని తెలుసుకున్నారు.

ఈరోజు సమస్యలు రెండుమూడు శతాబ్దాలనాటి సమస్యలవంటివి కావు. లిబరలిజం మనుగడకు, స్వేచ్ఛతో కూడిన ఉత్సాహం, ప్రజాస్వామికంమీద కాంక్ష వున్నట్లయితే, యీరోజు సమస్యలను సులభంగా పరిష్కరించవచ్చును. లిబరల్ మార్గాలకు రెండు హద్దులున్నవి. మానవుని పరిపూర్ణత చెందని స్వభావం లిబరల్సుకు తెలుసుగనుక, సుస్థిరమైన ప్రపంచ సౌఖ్యాన్ని వాగ్దానం చెయ్యరు. సహస్రవత్సరాల కాలపరిమితిగల శాంతిని కాంక్షించేవారంతా మరొకమార్గాన్ని చూచుకోవచ్చును. ఏఫలితాన్నికూడా తుది నిర్ణయంగా ఆమోదించుటకు లిబరల్సు అంగీకరించరు. ప్రతిదీకూడా పరిశోధనగానే భావిస్తారు. ఒకటి అపజయం పొందితే మరొక దాన్ని ప్రయత్నిస్తారు. ఈ ప్రపంచంలోవున్న అన్నిరోగాలను కుదుర్చుటకు ఔషధంలేదు. ఈమందుమాత్రం కమ్యూనిస్టులు, ఫాసిస్టులు దగ్గర వుంటుంది. వారు పోలీసు సహాయంతో, సాయుధబలాల అండతో, విచారణలేకుండా నిర్బంధించే విధానంతో, ప్రజలను అజమాయిషీలో పెట్టుకొనుటకు నోరెత్తకుండా చేయుటకు ఉపయోగిస్తారు.

సమస్యలనేవి అనేకంగా వుండును. ప్రస్తుతం అతి ప్రధానమైనవి నాలుగువున్నవి. సాంఘికవ్యాకులమైన వలస విధానవిప్లవం, అంతర్జాతీయ విషమపరిస్థితి, స్వేచ్ఛా సమాజాలను బెదరించే కమ్యూనిజం, ఇతర వుద్యమాలు. లిబరల్

ప్రజానీకం జీవించాలంటే, స్వేచ్ఛను మానవత్వాన్ని ఊతగా తీసికొని, అన్ని దేశాల జాతులను లిబరలు ప్రజాస్వామిక విధానంతో ప్రోత్సహించి, వైషమ్యాను ఎదుర్కొనుటకు సిద్ధపడాలి. వాటిని లిబరల్ మార్గంలో పరిష్కరించాలి.

అట్లాంటిక్ యిరుపక్కలావున్న మితవాదులు, యీ స్వేచ్ఛాసమాజాలని చెప్పబడే సమాజాలనుంచి వచ్చే ఫలితాలతో ప్రజలు తృప్తిచెందాలని, ఆర్థిక అస్థిరత్వంవల్ల, రక్షణ లేమివల్ల ఏర్పడిన క్లిష్టపరిస్థితిని జూచి భయపడకూడదని, ప్రకృతిసహజంగా ఏర్పడిన పరిణామాలను, నిరుద్యోగసమస్యను, గుత్తదనాన్ని గమనించకూడదనీ చెబుతారు. ప్రజలు తృప్తి పడినా లేకపోయినా, నిరుద్యోగం, గుత్తదనం, కొరతలు, ప్రకృతిస్వభావంవల్ల ఏర్పడినా, కాకపోయినా, అసలుసంగతి వుండనే వుంటుంది. సాంఘికవిద్య వున్నదంటే అనేకమంది తృప్తిలేకుండా విషమపరిస్థితులలో బాధపడుతున్నారు. మనకు ఆలోచనాశక్తి, వివేకజ్ఞానం వుంటే, స్వేచ్ఛాపూరితమైన వాంఛవుంటే, మనం కీలుబొమ్మలు కాకపోతే, మనకు దుష్టశక్తులు ఎదురైనప్పుడు వాటిని ఎదిరించుటకు సిద్ధంగా వుండాలి.

మితవాదులు వ్యాపారమనే పవిత్రతకులోనై, బానిసత్వంగల రాజ్యాలలో స్వేచ్ఛా ఆర్థికవిధానం వుండుటకు అవకాశంలేదని గ్రహించక కాపిటలిజం అభివృద్ధిపర్చుటకు, ఆ విధానంలోవున్న ఏ చిన్నలోపాన్ని సవరించక, రాజకీయ స్వేచ్ఛాసమాజాలను రక్షించజాలక పోయినారు. సంప్రదాయవాదులు, జాతీయవాదులు, కార్పరేటిజంతో, న్యూ మెర్కన్‌టైలిజం, స్టేటు క్యాపిటలిజంతో యింకను పరిశోధన సాగి

స్తున్నారు. కమ్యూనిస్టులు, సోషలిస్టులు కాపిటలిజానికి బదులుగా భిన్నమైన సమిష్టివిధానాన్ని పెట్టాలంటారు. లిబరల్సు ఈ సమిష్టివాదాన్ని తిరస్కరిస్తారు ఈ విధానానికి స్వేచ్ఛకు పొసగదు. ప్రయివేటు ఆర్థికవిధానాన్ని గుర్తిస్తారు. స్వేచ్ఛను, ఆర్థికవిధానాన్ని ప్రత్యేకంగా వుంచుతారు. సమస్యలు వచ్చేంత వరకు స్టేటు కలుగజేసుకోవలసిన అగత్యం రాదు. సమస్యలు వచ్చి పరిష్కరించుటకు పిలువబడినప్పుడు జోక్యం చేసుకొనక తప్పదు. అప్పుడు అనేక అనర్థాలు వచ్చును. సోషలిస్టులు అనుకుంటేది ఒకటి, జరిగేది ఒకటి జరుగుతోంది. సమిష్టివిధానం, మార్కెట్టులు విధానం కలిసిక లేని స్థితికి దారితీస్తాయి.

స్వేచ్ఛకు: అధికార వికేంద్రీకరణకు వున్న సంబంధాన్ని లిబరల్సు గ్రోసిబుచ్చును. ఆర్థికవిధానంయొక్క సమానత్వం ఎగుడు దిగుడుగా వున్నట్లయితే, స్వేచ్ఛ అసంభవం. కనీసం స్వేచ్ఛ అయోమయస్థితిలో వుంటుంది. ఆర్థిక అధికారంలో అనేక మూలపదార్థాలు వుండును. ఆ స్థితి ప్రమాదంగా వుంటుంది. ఎన్నికలద్వారా రాజకీయాధికారం, సమానమైన విద్యద్వారా వైజ్ఞానిక దృష్టి విస్తరింపజేయబడినట్లుగా, ఆస్తిని వ్యాపింపజేయటంకూడా ఆర్థిక అధికారాన్ని విస్తరింపజేయటం మీద ఆధారపడి వుంటుంది. ఈవిషయంలో కొన్ని జాతులు ముందుకు పోయినవి. యునైటెడ్ స్టేట్సులో మూడువంతుల సంసారాలు ఉత్పత్తి సాధనాలలో భాగస్వాములుగా వుంటారు. వినియోగదారుని పెట్టుబడిని పొందివుంటారు. ఆర్థికస్తోమతను యిస్తారు. కనీసం మూడు కామన్‌వెల్తు దేశాలలో సొంతఆస్తి బాగా వ్యాపింపజేయబడినది. ఈవిషయం ఫ్రాన్సు, చిన్న

యూరోపియన్ ప్రజాస్వామికాలలో వున్నది. ఎప్పుడైనా ఏ కొద్దిమంది చేతులలోనే ఆస్తి వుండేపరిస్థితి వచ్చినపుడు, ఆర్థిక విధానం దెబ్బతిననప్పటికి, కలుగజేసికోవలసిన అగత్యం ఏర్పడుతుంది. ఇన్‌కంటాక్సులు, కాపిటల్ పన్నులు, డెత్‌డ్యూటీలు, కూలిపెంచటం మొదలగు విధానంతో, ఆర్థిక అధికారాన్ని సమంగా చేయుటకు ఉపయోగపడును. స్వేచ్ఛా సమాజాలను బలపర్చును. మార్కెటులో అనేకమంది పాల్గొనుటకు అవకాశం ఏర్పర్చును. ధరలు, కూలీ, వడ్డీ, లాభాలు నిర్ణయించటంలో ఒకపద్ధతి ఆచరించబడును.

19వ శతాబ్దం ఆఖరు దగ్గరనుంచి అన్ని దేశాలలో వున్న లిబరల్సుఅంతా, అంటే మితవాదులువైపుకు మొగ్గిన వారంతా, స్వేచ్ఛగావున్న జాతిలో ప్రయివేటు ఆర్థికాన్ని మనగలిగేటట్టు సంస్కరణ విధానాన్ని ప్రోత్సహించారు. బ్యాంకర్లు, పారిశ్రామికదార్లు, యీ విధానాన్ని పూర్తిగా గ్రహించక, వ్యాపారపీడనాన్ని వదిలించ లేకపోయినారు. క్రెడిట్ కంట్రోల్సును బట్టి స్టేటుద్వారా ప్రజలకొనుగోలు శక్తిని పెంచటంకన్నా ఏమిచేయగలదు? మితిమీరిన అసందిగ్ధ పరిస్థితిని అదుపులో వుంచుటకు ప్రయివేటు పబ్లిక్ ఆర్థిక విధానాలను హద్దులలో వుంచాడు. ఉద్యోగం యిచ్చేవారు. నిరుద్యోగసమస్యను పరిష్కరించలేకపోయినారు. వసతిపాటలు లేకుండా వేలాదిమందిని సోమరులుగా తయారుచేశారు. వేలాది కూలీలను పనికిరానివారిక్రింద జమకట్టారు. ఈ పరిస్థితులలో జోక్యం అవసరం. ట్రేడుయూనియన్‌లకు అధికారం అవసరం. పబ్లిక్ పనులు చేయించటం అవసరం. ఉద్యోగస్తులను, డబ్బు

నుండి, ముసలితనంకు అకస్మాత్తుగా సంభవించు అపాయాలకు రక్షణకలిగించే నిమిత్తం నేషనల్ ఇన్సూరెన్సు పథకాలను ప్రవేశపెట్టారు. భూస్వాములు తొందరగా భాగ్యవంతులగుటకు వారి పొలాలను నిర్వాహ్యం చేస్తున్నప్పుడు అటకాయించారు. కొన్ని నిబంధనలు ప్రవేశపెట్టారు. పెట్టుబడిదారుల కార్టెల్సు, ట్రస్టులు, మోనాపొలీలను ప్రోత్సహిస్తారు. వాటియందు మోజు జాస్తి. వాటిని సమిష్టిగా వుంచుతే వినియోగదారులను దోచుకుంటాయి. ఈ దోపిడీవిధానాన్ని అరికట్టుటకు వాటిని ప్రత్యేకంగావుంచాలి. పార్లమెంటరీ, అదుపు ఆజ్ఞలలో వుంచాలి. వ్యాపారస్తులు, ఆర్థికవేత్తలు దీనిని వ్యతిరేకించారు. చట్టసమ్మతమైన ఆర్థికవిధానాన్ని వారు ప్రసాదించకపోతే, కనీసం కొంత రక్షణను, స్థిరీకరణను యివ్వాలి.

ఈరోజు స్వేచ్ఛా వ్యాపారం బ్రిటనులో బలహీనంగా వున్నది. లాయడ్ జార్జి సంస్కరణలు లేకపోయితే, అది పూర్తిగా మాయమైవుండేది. అమెరికాలో స్వేచ్ఛావ్యాపారం ఉన్నత స్థాయిలోవున్నది. చట్టంద్వారా ఆర్థికవిధానాన్ని స్వేచ్ఛగా వుండేటట్లు అమెరికన్ పరిపాలకులు జేశారు. స్వేచ్ఛను దృష్టిలోపెట్టుకొని చూచినట్లయితే, కాపిటలిజం లేక స్వేచ్ఛావ్యాపారం, స్టేటునుంచి ఆర్థికవిధానాన్ని ప్రత్యేకంగా వుంచారు. వ్యక్తి స్వాతంత్ర్యాన్ని కాపాడారు. ఆస్తిపాస్తులను విస్తరింపజేశారు. ఆర్థికవిముక్తికోసం ప్రయత్నించే లాగున వ్యక్తిని తయారుజేస్తుంది. యితర విధానాల కన్నా స్వేచ్ఛా ఆర్థికవిధానం మంచిది. నానాటికి క్షీణించుకుపోయ్యే విధానాన్ని అరికట్టుటకు, మరల స్వేచ్ఛను, లిబరల్ ప్రజా

స్వామికాన్ని ప్రోత్సహించుటకు, స్వేచ్ఛా, ఆర్థికవిధానం దోహదంగా వుంటుంది.

కాపిటలిజం లోపాలను మరచిపోకూడదు. స్వేచ్ఛ, కాపిటలిజం సమానస్థాయిలో వుండునని మూర్ఖంగా పిడివాదం చేయకూడదు. మన ఆలోచనను పిడివాదంగా మారుస్తే, దాని వల్ల వచ్చేఫలితం దేశంలో ఒకే ఒక ఆర్థికవిధానంగా వుంటుం దని నమ్ముతారు. కాపిటలిజం, మితవాదం, పబ్లిక్ యాజమాన్యం కలుపుకుంటూ కెనడియనులు, న్యూజలాండర్సు, స్విస్, స్కాండినేవియన్స్ మంచిగానే నడుపుకువచ్చారు. యునైటెడ్ స్టేట్సులో రైతులు వ్యాపారంమీదే మోజు పడినప్పటికి, అమెరికా స్వేచ్ఛావిధానం దెబ్బతినలేదు. బలహీనత చెందలేదు. ఫ్రాన్సులోవలె కాపిటలిజంకు ముందువున్న, సంసారికకళాకారుల ఆర్థికవిధానమును తోసివేయుటకు తగిన కారణంలేదు. ప్రయివేటువ్యాపారసంస్థలకన్నా, పబ్లిక్ సంస్థలైన మునిసిపాలిటీలు ఎక్కువలాభాలు గడించుటకు వీలున్న వాటిని ఎందుకు తీసికోనకూడదు? ప్రయివేటు ఆర్థికవిధానం వెనుకబడిన పబ్లిక్ విధానం ముందుకువచ్చును. లోపాలను సహించును.

మానవుని అనుభావాన్ని ఆధారంగా తీసికుంటే, స్వేచ్ఛకు స్వంతఆస్తివుండాలనియు, ఆహక్కును క్రమపద్ధతిలో ఉపయోగించవలయుననియు తెలుస్తున్నది. నేటికాలంలో నిస్సందేహంగా పోటీబడు కాపిటలిజానికి, స్వేచ్ఛకు అన్యోన్య సంబంధమున్నదని తెలియుచున్నది. ఫాసిస్టు సముదాయం, సమిష్టివిధానంకన్నా, మోనాపలీ కాపిటలిజం స్వేచ్ఛతో

అనుగుణ్యంగా వుండదు. ఆర్థిక స్వేచ్ఛ అంటే ప్రయివేటు ఆస్తి వుండటమే గాకుండా, పరిశోధనకు అవకాశముండే ఒకవిధానం. మరియు ప్రయివేటు, పబ్లిక్ యజమానికి బానిసగా వుండ కూడదు.

సముద్రాలకు బయటవున్న లిబరల్ ప్రజాస్వామిక జాతులు ప్రచారంవల్ల స్వదేశాలలో వలసవిధానానికి వ్యతిరేకతలవల్లవచ్చిన సహాయంవల్ల, 20 రాజ్యాలు స్వాతంత్ర్యాన్ని పొందినవి. మొదటి రెండు ప్రపంచయుద్ధాలలో అధికార వాహాన్ని లిబరల్ ప్రజాస్వామికవాదులు అటకాయించారు. అందువల్ల మరొక 6 రాజ్యాలు స్వాతంత్రంపొందినవి. 1957 నుంచి 1960 లోగా మరొక 5 రాజ్యాలు స్వాతంత్రను పొంద గలవు. మొత్తం 31 దేశాలు అయినవి. అనేకచోట్ల దౌర్జన్యంలేకుండానే స్వాతంత్ర్యం వచ్చినది. (ఉదాహరణకు ఫిలిప్పైన్సు, సిలోను, గోల్డుకోస్టు, నైగేరియా, బ్రిటిష్ పశ్చిమ దీవులలో జరుగుతున్నట్లుగా) కొన్నిచోట్ల దౌర్జన్యం జరిగింది. మరికొన్ని సందర్భాలలో లిబరల్ సంప్రదాయాన్నిబట్టి, లిబరలిజం బలహీనత ప్రాబల్యాన్నిబట్టి దౌర్జన్యం జరిగింది. పాశ్చాత్య వలసవిధానం సమసిపోతున్నది. అన్నిటికంటే అతి ముఖ్యమైనది నిరంకుశదేశాల వలసవిధానం. అందులో ముఖ్యంగా సోవియటుయూనియన్, చైనాదేశాలు జాతీయ వాదులు మొదటిదాంతోనే వ్యాకులతపడుతున్నారు. లిబరల్సు రెంటితోనూ వ్యాకులత పడుతున్నారు.

లిబరల్ వలసవిధానం అంటే సామంతరాజ్యాలలో వుండే పౌరుల ఎన్నికలద్వారా అధికారమునకు రావలయునని,

పబ్లిక్ వ్యవహారములలో పాల్గొనవలయునని కోరుతుంది. స్థాన దృష్టిని ప్రబలంచేసి, విద్యావ్యాప్తినిజేసి, శాస్త్రీయవాదాన్ని, విమర్శనా దృక్పథాన్ని పెంపొందింపజేయటం – ప్రజా [illegible] పబ్లిక్ సంస్థలనుంచి వచ్చే ఆదాయాన్ని అక్కడ వ్యాపారాది వుపయోగంకోసం వినియోగపర్చటం – స్వేచ్ఛా సమాజాల ద్వారా అచ్చట నివాసులకు పరిపాలించే శక్తినివ్వటం – అధికారంలో వుండేవారు వైదొలగి వారికి అప్పజెప్పాలి. లిబర లిజం యొక్క మొదటిలక్ష్యం, జాతీయ స్వాతంత్ర్యాన్ని సంపా దించటంకాదు– వ్యక్తికి స్వేచ్ఛనివ్వటం – స్వేచ్ఛకు సుస్థిరత్వం వుంటే, జాతీయస్వాతంత్ర్యం సులభంగా సంపాదించవచ్చునని తెలుస్తున్నది. దేశీయమైన నియంతృత్వంతో, విదేశీ లిబరల్ ప్రజాస్వామికం, రాజ్యాంగంద్వారా పరిమితిగా యిచ్చిన స్వేచ్ఛను మార్పుచేయటం లిబరలిజం కాదు. గత 10 సం॥ రాలలో దురదృష్టవశాత్తు యిట్టిసందర్భాలు కొన్నివున్నాయి.

కమ్యూనిస్టు నియంతృత్వంక్రింద వున్న దేశాలతో పోల్చిచూస్తే, పాశ్చాత్య వలసవిధానసమస్య చాలా స్వల్పం. జారిస్టూ, మన్‌చూ రాజ్యాలు అణగారిపోవుటవల్ల, క్రుంగి కృశించిపోతున్న అనేక జాతులు స్వేచ్ఛను పొందినవి. కీవ్ మరియు యురిషచితో, టిఫిలిస్ మరియు లాసా, రీగా మరియు ఆర్గాలో, స్వాతంత్ర్యాన్ని ప్రకటించారు. అంతర్‌కలహాలు పూర్తి అయినతరువాత తిరిగి రష్యనులు యూక్రైన్, కాకసస్, సెంట్రల్ ఏషియా మంగోలియనులను ఆక్రమించుకున్నారు. రెండవ ప్రపంచ యుద్ధరంగంలో ప్రవేశించేముందు బాల్టిక్

స్టేట్సును కలుపుకున్నారు. రెండవ ప్రపంచయుద్ధానంతరం, మరొక 6 ఐరోపా రాజ్యాలమీద, జర్మనీలో ఒక భాగంమీద అధికారాన్ని సంపాదించారు. టిబిటియనులు విఘుర్సు, మంచూరి యన్సు సంపాదించిన స్వాతంత్ర్యాన్ని, మావో అధికారంతో చైనీయులు హరించారు. దక్షిణ కొరియనులను వియత్ నామ్, లమోటియన్సు, నెపాలీసులను బెదరించారు. సోవియట్, చైనా రాజ్యాలలో నేషనల్ మైనారిటీ వర్గాలవారు 250 మిలియన్ల ప్రజలున్నారు. వారు నివసించుచున్న ప్రదేశం యూరప్ అంత పెద్దది. ఈ మైనారిటీలలో 20 జాతులకుపైగా వారికి ప్రత్యేక మైన చరిత్ర, ప్రాచీన సంప్రదాయం, పరిజ్ఞానం వున్నది. మిగతావారందరూ ఆఫ్రికాలోని శాంటసు తెగకు చెందిన వారివలె వుంటారు. 250 మిలియన్ల ప్రజానీకానికి, మిగతా కమ్యూనిస్టు వ్యతిరేక ప్రపంచానికి సంబంధంలేదు. అయినా వారిసంగతి మరచిపోకూడదు. ఏదో ఒక రోజున వారికి స్వాతంత్ర్యం సిద్ధించేలాగున ప్రయత్నం చేయవలసినవిధి లిబరల్ ప్రజాస్వామిక వాదులపైన వున్నది.

1899 ప్రథమ హేగు సమావేశాల దగ్గరనుంచి, నానా రాజ్యసమితి, ఐక్యరాజ్యసమితి, అంతర్జాతీయ కోర్టు, 1922 - 19 ఏ వరకు జరిగిన నిరాయుధీకరణ సమావేశములు, 1928 బ్రియాండ్ కెల్లాగ్ సంధి, 1955 శిఖరాగ్ర సమావేశము, అంత ర్జాతీయవాదం అభివృద్ధిచెందినది. తీర్మానం, ప్రకటన, ఒడం బడిక, అధికారపత్రము అన్నియుకూడా శాంతినే కోరుచున్నవి. కాని శాంతిని పోషించలేక పోయినవి. తగాదాలకుకూడా అవే

మూలకారణాలుగా వున్నవి. కొద్దిమంది చేతులలోనే అధికారం కేంద్రీకృతమై వున్నది. నిరంకుశత్వాన్ని వ్యతిరేకించే శక్తులకన్నా, నియంతృత్వానికే ఎక్కువబలం వున్నది. దాని ఫలితం యుద్ధం. యుద్ధాన్ని నివారించుటకు అధికారం సమానంగా వుండాలి. అన్ని లిబరల్ ప్రజాస్వామిక జాతుల ప్రధాన యత్నం, యీ అధికార సమానతమీద ఆధారపడి వుంటుంది. సంధులు, రక్షణఏర్పాట్లు, మిలిటరీబడ్జట్లు, మిలిటరీ వినియోగం ప్రధానంగా వుంటాయి. ఇంకా ఎన్ని సంవత్సరాలు, ఎన్ని శతాబ్దాలు యీ అశాంతిపరిస్థితి వుంటుందో మనకు తెలియదు. ఈవిధమైన క్లిష్టపరిస్థితినుంచి నిలకడవిధానానికి వెళ్ళుటకు నిరీక్షిస్తూ వుండాలి. ప్రపంచ నియంతృత్వం విజయంపొందటమో లేక అధికారం, బలంగల రాజ్యాలు లిబరల్ స్వేచ్ఛా సమాజాలను ఆమోదించి అనుసరించటమో జరగాలి. స్వతంత్ర జాతులుగల ప్రపంచంలో యుద్ధోన్మాదం పోవాలంటే, ప్రజలచే ఎన్నుకోబడి ప్రజాప్రతినిధులుగల ప్రజాప్రభుత్వం ఏర్పడటం, నియంతృత్వధోరణి మాసిపోవటం, స్వేచ్ఛా పూరితమైన ఎన్నికలు, పత్రికాస్వాతంత్ర్యం, ప్రజాస్వామిక విధానాల ద్వారా నెమ్మదిగా నిర్ణయాలు జరగాలి. సంపూర్ణ అధికార స్థానంలో లిబరల్ ప్రజాస్వామికం రావాలి. ఇటూ బయట యెవ్వరైతే స్వేచ్ఛకోసం పనిచేస్తారో అట్టివారే నిజమైన శాంతికోసం ప్రయత్నం చేస్తారు.

నిరంకుశ విధానాలు, వుద్యమాలు ఎప్పుడూ లిబరల్ ప్రజాస్వామికవాదులను ఎదుర్కొంటూవుండును. స్వాతంత్ర్యం

వున్నందున వ్యక్తులు, వర్గాలు లిబరల్ ప్రజాస్వామికాన్ని ఎదిరించును. ఈ పరిస్థితి అనివార్యం. దీన్ని పరిష్కారం చేయటం అతికష్టమైన విషయం. గ్రేట్బ్రిటను, స్విట్జర్లాండ్ లోను కొద్దికాలం క్రితంవరకూ ఫాసిస్టువర్గాలు సృష్టించబడినవి. జర్మనీ వీమియార్ రిపబ్లిక్కు సహానం నాజీలకు కమ్యూనిస్టులకు మరియు అవకాశవాదులకు అవకాశములు ఎక్కువుగా దొరికినవి. యునైటెడ్ స్టేట్సులో అమెరికన్ ఫస్ట్సర్సు, మాకార్థిజమ్ తెగగావున్నారు. ఇండియాలో పార్లమెంటరీ ఫెడరల్ రిపబ్లిక్కు ఏర్పడినదగ్గరనుంచి, అధికారప్రాబల్యం ఎక్కువగావున్నది.

స్వేచ్ఛ సమాజంలో స్వాభావికంగావుండే అసంతృప్తి లోపాలవల్ల లిబరల్ ప్రజాస్వామికాన్ని వ్యతిరేకిస్తారు. (స్వేచ్ఛపాత్ర ఎంతో ఉదారంగా వున్నప్పటికి, స్వేచ్ఛవలన మంచి, చెడు రెండూవచ్చును. తరుచు మాప్పవస్తూవుండుట వలన బాధకూడావస్తుంది. ఈ సంగతి మరవకూడదు.) ఈ విషయంలో ప్రతిపక్షం మంచిపనిచేస్తుంది. అసంతృప్తివల్ల వచ్చిన లోపాలను సవరించటం లిబరల్సుయొక్క ప్రధాన కర్తవ్యం. ఈ లోపాలవల్ల ప్రజాస్వామికాన్ని వ్యతిరేకిస్తారు. స్వేచ్ఛయొక్క ఫలితాలను లోటుపాటులను మించిన అధికార విశ్వాసంలో నమ్మకంకల్గి వ్యతిరేకిస్తారు. వాక్స్వాతంత్ర్యం, పత్రికా స్వాతంత్ర్యం, న్యాయబుద్ధి, విద్య కీడుచేస్తాయి. అన్ని దేశాలలోను సంప్రదాయవాదాన్ని పోషిస్తాయి. ప్రాతినిధ్యం వహించే సమాజాలుకూడా అపచారం చేస్తాయి. మాధత్వం

గల జాతీయవాదులను ప్రోత్సహిస్తాయి. రాజకీయ స్వాతంత్ర్యం మోసం - ఆర్థిక స్వేచ్ఛకీడులో ఆనిశ్చయానికి సందేహానికి తావు లేదని స్పష్టంగా తెలుస్తున్నది. ఇది జారిపొయ్యే పరిణామం అయినట్లయితే దాన్ని వొదలివేయ వచ్చును. దానిసంగతి అదే చూచుకుంటుంది. (ఉదాహరణకు యీరోజు ట్రాట్స్కీ-యిజం, 1914 ముందు యూరప్‌ను ముంచిన సిండికలిజం, రేమలియిజం మొదలగునవి.) లిబరల్ ప్రజాస్వామికంలోసంకటంగావున్న వారిలోకూడాసౌమ్యంగా వుండటం ప్రజలు నేర్చుకోవాలి. అట్టి స్వేచ్ఛా సమాజాలను వ్యతిరేకించే ప్రతిపక్షాలను లేకుండా చెయ్యాలి. అవసరమైతే సాయుధబలాలతో ఎదిరించి రూపుమాపాలి. స్టూవర్టు లెజిటిమిస్టులను బ్రిటను చేసినట్లుగా. ఫ్రెంచి కమ్యూనిస్టులను చేసిన విధంగా, కమ్యూనిస్టులను ఇండియనులు చేసిన విధంగా చెయ్యాలి. స్వేచ్ఛయొక్క శత్రువులను ఎప్పుడు సహించేది, ఎప్పుడు నాశనం చేసేది, ఏ పుస్తకం ఏ రాజకీయ శాస్త్రజ్ఞుడు చెప్పలేదు. రాజకీయ పరిపూర్ణత చెందినవాడే, ఏ విధంగా ప్రవర్తించాలో, ఎట్లా మెలగాలో తెలుస్తున్నది. ఫాసిస్టు, కమ్యూనిస్టు సమాజాలను స్విన్ ఏవిధమైన రాజకీయ పరిపూర్ణతలో రూపుమాపినదో ఆ విధంగా వుండాలి.

ఫాసిజం పడిపోయిన తరువాత స్వేచ్ఛకు కమ్యూనిజం ఆటంకంగా నిలబడిపోయింది. ఆర్థికదోపిడీ విధానంవల్ల అసంతృప్తి చెందిన కర్షకులు కార్మికులు, కమ్యూనిజం వైపుకు

పొగ్గరు. ఈ కమ్యూనిస్టు దుష్టశక్తిని నిర్మూలించాలంటే, లిబరల్ ప్రజాస్వామిక వాదులు కృషి చెయ్యాలి. ప్రపంచంలో ఎక్కువగా కూడా కర్షకులు, కార్మికులు స్వేచ్ఛకు శత్రువులుగా లేరు. నిరాశ నిస్పృహ చెందిన విజ్ఞానవేత్తలతో కూడినవారు – కమ్యూనిస్టు వ్యూహానికి దోహదంగా వున్నవారు లిబరల్ ప్రజాస్వామికానికి పూర్తిగా వ్యతిరేకులు. లిబరల్ ప్రజాస్వామికం సాధించే, కోరే ప్రతి విషయాన్ని, కమ్యూనిజం ప్రతిఘటిస్తుంది. ప్రజాస్వామికంలో వ్యక్తి స్వేచ్ఛకు, హక్కులకు, పనికి, జీవితవిధానాన్ని నిర్ణయించుకొనుటకు. విశాలమైన సాంఘిక నిర్మాణానికి, అనేక విధాలైన పరిశోధనలకు, వివిధ భిన్నాభిప్రాయాలకు, పార్లమెంటరీ ప్రజాస్వామిక ప్రభుత్వానికి, ప్రతిపక్షాలను సహించేందుకు, అభిప్రాయాలను వ్యక్తం చేయుటకు భిన్నమతాలకు అవకాశముంటుంది. కమ్యూనిస్టు రష్యానుంచి అంతులేని ద్రవ్యసాధనలను ఊతగా తీసికొని, కమ్యూనిజం బలపడింది. కమ్యూనిజంలో పూర్తిగా నమ్మకం వున్నవారిలో, అంగీకారం గాని, అర్థం చేసికొనటం గాని పొసగదు.

